

జీవిత రథం -

కవితా కేతనంతో,

భావనోద్రిక్త మనో సారథితో,

జవసత్త్వ, ఊహాసత్త్వ

పవనాశ్వాలతో

వచ్చి ఆగింది

క్షణ కాలం !-

రహదారుల కూడలిలో !

క్రాస్ రోడ్స్‌లో ! !-

- o -

# క్రాస్ రోడ్స్

కవితా సంకలనం

## జి. వి. సుబ్బారావు

Cover Printed at Sri Balaji Printers Chikkadpally, Hyd-20.

# క్రాస్ రోడ్స్



కవితా సంకలనం

జి.వి. సుబ్బారావు యం.ఏ.,

కవితా సంకలనం - క్రాస్ రోడ్స్

ప్రచురణ - నవంబరు, 1994

ముఖచిత్రం - శ్రీ శీలా వీర్రాజు

కవరు పేజీ ముద్రణ - శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడ పల్లి, హైద్రాబాద్.

బ్లాకులు - గోపీ బ్లాక్స్ లకిడీకాపూల్
హైద్రాబాదు.

వెల - ఇరవైరూపాయలు

ప్రతులకు - జి.వి.సుబ్బారావు,
10-1-18/24, శ్యామ్ నగర్,
హైద్రాబాద్ - 500 004

---

ముద్రణ - ఫ్లెనోగ్రాపర్స్ చిరాగ్ ఆలీ లేన్
హైద్రాబాద్ - 500 001

అంకితం

శ్రీమతికి

**జి.ప్రమీలకు**

# తొలిపలుకు

అచ్చమైన తెలుగు కవితా సంకలనానికి, - 'క్రాస్ -రోడ్స్' - అనే ఇంగ్లీష్ టైటిల్ ఏమిటా? అని ఆశ్చర్యపోతున్నారా! దానికి ఒక కారణం లేకపోలేదు. నా కవితా ప్రస్థానం ఛందోబద్ధ కవిత్వంతో మొదలైనా, వచన కవిత్వమూ చోటు చేసుకుంటూ వచ్చింది. 'ఇదా - అదా' అనే మధనలో పడి, నా ఆలోచనా స్పందనం క్రాస్ రోడ్స్‌లో పడ్డప్పుడు, ఈ 'క్రాస్ రోడ్స్' అనే వచన కవిత నేను 1972 లో వ్రాయటం. అది సహృదయులైన స్వర్గీయ టి.వి. భద్రి రాజుగారి మెప్పును పొంది, కవిసమ్మేళనంలో వినిపించటం, ఆ తర్వాత డిసెంబరు 1972, 'భారతి' లో ప్రచురింపబడటం జరిగింది. ఇలా మొదలైంది నావచన కవిత కొంత వెలుగును సంతరించుకోడానికి. ఆ తర్వాత కొన్నేండ్లు వరుసగా, కొంతకాలం అప్పుడప్పుడూ 'భారతి' లో నాకవితలు ప్రచురింపబడుతూ వచ్చాయి. ఇక మా 'రంజని' నా కవితలను ప్రత్యేకాభిమానంతో ప్రచురిస్తుండేది. 'క్రాస్ రోడ్స్' తో శ్రీకారం చుట్టిన, ఈ కవితాసంకలనానికి ఆ పేరే సముచితమని నేను భావించాను. రసికులు, సహృదయులైన పాఠకులు మీరూ, దీన్ని హర్షించి, ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ కవితా సంకలనంలో ఎక్కువగా 'భారతి'లో, కొన్ని 'రంజని' లోనూ - ప్రచురింపబడిన కవితలున్నాయి. ఆ రెండు సంస్థలకు నాహృదయ పూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఇక తెలుగు భాషపై ప్రత్యేకాభిమానం, అభినివేశం తప్ప, అందులో నాకేమీ డిగ్రీలు లేవు. నావృత్తికీ కవితా వ్యావృతికీ అసలు సంబంధం లేదు. కాని

వృత్తి రీత్యా టూర్స్ ఎక్కువ తిరగటం వల్ల, సహృదయులైన కవి మిత్రులతో పరిచయం, పరిసరాలనీ, ప్రకృతినీ పరిశీలించటం, పుస్తకాలు కొని, చదవటం. రసార్ద్రతతో హృదయం ద్రవించినప్పుడల్లా - రచనలు చేయటం - ఇలా సాగింది నా జీవన యాత్ర, 1973 లో రామప్ప శిథిలదేవాలయాలను సందర్శించిన నాహృదయ స్పందన - 'ఆవేదన' అనే కవితకు 1992 లో 'నయాగరా' జలపాతాన్ని చూసినప్పుడు కలిగిన కవితా ప్రతిస్పందన 'నయాగరా' అనే కవితకు ఆలంబనం. కవిసమ్రాట్ విశ్వనాథనీ, మహాకవి శ్రీశ్రీనీ ఎక్కువగా అభిమానిస్తాను. ఛందో బద్ధ కవిత్వం, వచన కవిత్వం రెండూ నాలో ధ్వనిస్తాయి. అందుకే ఇది వచన కవితా సంకలనమైనా, కొన్ని 'భారతి'లో ప్రచురింపబడిన పద్యకవిత్వాలను ఇందులో జోడించాను. ఇది ప్రకర్షకాదు. కేవలం పరిచయం మాత్రమే.

రసజ్ఞులైన పాఠకలోకం - 'క్రాస్ రోడ్స్' నుండి 'నయాగరా' వరకు - సాగిన ఈ కవితా సంకలనంలోని మంచిని మెచ్చుకొని, చెడును వదిలేసి - దీన్ని సహృదయంతో ఆదరిస్తారని భావిస్తున్నాను.

హైదరాబాదు. బుధ విధేయుడు

1994. నవంబరు జి.వి. సుబ్బారావు

## ఇందులో.......

# క్రాస్ రోడ్స్

జీవిత రథం
కవితాకేతనంతో
భావనోద్రిక్త మనోసారథితో
జవసత్వ ఊహాసత్వ
పవనాశ్వాలతో
వచ్చి ఆగింది క్షణకాలం -
రహదారుల కూడలిలో,
క్రాస్ రోడ్స్‌లో!!-
ఉన్న నాలుగు మార్గాంతరాలు
ఊహాపథాని కందని విహంగాలు
కనుచూపుమేరలో
ఆశాలతాంతాలు
కల్పించి, ఊరించే ఒయాసిస్సులు!-
తొలిచూపులో
తెలిరేకలు -
ఎదిగే కొలది ఎర్రని మంటలు,
క్షణక్షణాన విసిరే వేడి నిట్టూర్పులు -
ఇది-
తూరుపు ప్రొద్దువిరిసిన వడగాడ్పులు!
మలిచూపులో
అరుణారుణ రేఖలు
ఒదిగే కొలది కాళరాత్రి నీలిమలు,
క్షణక్షణాన ముసిరే
శీతల వాయు వాహినులు,
అది-

పాతపాఠాలు నెమరేసే కాపిటలిస్టులు,
సంక్షేమ రాజ్యాలు స్వప్నాలుగనే సోషలిస్టులు,
కర్కశంగా సంఘాన్ని కుదిపేసే మార్క్సిస్టులు,
'నెక్'లు చెక్కడంలో 'సక్సెస్' గడించే నక్సలైట్లు!-
భిన్ననినాదాల, ప్రచ్ఛన్నభావాల
'హోరన్ల' హోరులో,
చతుష్పథంలో చతుష్పాదాలల్లా,
సంఘం ప్రగతికి
'ఆటోమేటిక్' బ్రేకుల్లా-
అంతా నడుస్తున్నారు వడివడిగా-
ఈ కూడలిలో !
గొంతెత్తి కూస్తున్నారు
జాతికి గుణ పాఠాలు!
వంతలు పాడుతున్నారు
వందిమాగధుల్లా ఉపనాయకులు,
వేదికలెక్కి మాలలతో
వల్లిస్తున్నారు వాగ్దానాలు!
నాయకమ్మన్యు, లీ
క్రాస్ రోడ్స్‌లో !-
అయినా -
కుళ్ళు కుళ్ళు గానే మిగిలింది
సంఘం 'డస్ట్ బిన్'లో,
అవినీతి - మత్తు ఊడలా
లోతుగా పాతుకుంది ఈ లోకంలో!-
కుట్రలూ, ఖూనీలూ,
అన్నీ అవిఛ్ఛిన్నంగా
దిన కృత్యంగా
జరుగుతున్నాయి ఈ దేశంలో!

పేదవాడు - మరీ
బీదవాడుగా
'ఇజా'లే నిజాలుగా
బ్రతుకు బరువుగా
మృత్యుముఖంగా నడుస్తూంది
సామాన్యుడికి, ఏమీలేని వాడికి!
ఈ చతుష్పథంలో
చతురాస్యుని సృష్టికి మిన్నగా,
విశ్వామిత్రుని మధ్యేమార్గ సృష్టికి విభిన్నంగా,
విభేధాలు, విద్వేషాలు, విలయాలు
విశృంఖలంగా సృష్టింపబడుతున్నాయి!
అందుకే -
అంధునిలా, జాత్యంధునిలా
నిరాశతో, నిస్పృహతో, నిస్సత్తువతో
దిగాలుపడి, దిక్కుతెలియక
కుప్పగా కూలబడ్డాను -
ఈ క్రాస్ రోడ్స్‌లో! -
సంగీత, సాహిత్య సమ్మేళనంతో
భక్తి పారవశ్యంతో
త్రివేణీ సంగమంలా పొంగిన
త్యాగయ్య గారి దొకదారి!
ఆత్మాశ్రయంగా
సంగీతామృతం కురిపించిన
మీరా భజన లహరు లొకతెరువు!
బహువిధ వాద్య సమ్మేళనం
వినూత్న భావసంభరితం
పాశ్చాత్య గీతా ప్రభావిత
నవీన సంప్రదాయమొక రీతి!
పరంపరాగతమై

జనబాహుళ్యమై, ఆపాతమధురమౌ
సంప్రదాయ యక్షగాన మింకొకరీతి!
కానీ -
ఈ చతుష్పథంలో
బ్యాండు మేళంలా, హిప్పీ సంగీతంలా
'రాక్ అండ్ రోల్' మ్యూజిక్‌లా -
వినిపిస్తుందో అపశ్రుతి!
హార్మోనియం శ్రుతి!
అదే, నామనసులో ఏదీ వినలేని
బధిరు దుర్గతి! -
కవిబ్రహ్మ తిక్కన్న
కావ్యాద్వైత వాహినిలో,
బమ్మెర పోతన్న
భక్తి భావ లహరిలో
అల్లసాని పెద్దన్న
కవనాల అల్లిక జిగి బిగిలో,
శ్రీనాథ కవిసార్వభౌమ
గంభీర కవితారసతరంగాలలో,
పయనించాను
ప్రాగ్దిశాభిముఖంగా కొన్నాళ్ళు! -
శ్లేషార్థనిధి రామరాజ భూషణ
కంకణ నిక్వాణంలో,
ప్రౌఢార్థ మరీచి రామలింగని కవితాంగణంలో,
ద్రావిడాన్వయమణి శ్రీకృష్ణ దేవరాయల
సాహితీ సమరాంగణంలో,
తంజావురీ రసధుని నాయకరాజ
శృంగార కళాప్రాంగణంలో,
విహరించాను - పశ్చిమాభిముఖంగా కొన్నాళ్ళు! -
కవనాన్ని, అవధానాన్ని

కమ్మగామలంచిన కవికుల గురువులతో
ప్రాతక్రొత్తల మేలు కలయిక - గురజాడవారి
నూత్న కలకంఠ మధురిమలతో,
స్వాతంత్ర్య సమరాన సరిక్రొత్త గొంతులో
జాతీయ వైతాళికులతో,
ఆంధ్రాభిమానమే ఆకాశమంటగా
వినుతించు చారిత్రకులతో,
ఉరకలే వేసాను
ఉత్తరాభిముఖంగా కొన్నాళ్ళు! -
ప్రాచీన ప్రతిభా సమ్రాట్టు
విశ్వనాథ కవి సమ్రాట్
కవితా రూపతపస్సులో, విశ్వవిపంచిలో,
భావవిప్లవశ్రీ, కవితా ఉషశ్రీ
శ్రీశ్రీ-మహాకవి-
రసఝ్ఝరీ తరంగ మహాగర్జనలలో,
కృష్ణ పక్షపురాత్రి నర్తించు
భావ కవితా మూర్తి
కృష్ణ శాస్త్రి గారి క్రీనీడలో,
జానపద గేయాలు, భావకవిగీతాలు
దిగంబర కవితా క్రోశాలలో
వచన కవితా స్రవంతులలో-
పరుగులెత్తాను-
దక్షిణాభిముఖంగా కొన్నాళ్ళు! -
ఇలా -
నలుదిక్కులా నడచి,
వెనుదిరిగి వచ్చాను
రసరమ్య భావనా లోకాలవదిలి!
సెంటురు'లో కలలతో
ఒంటరిగ నిలిచాను.

తీరుతెన్నులు లేని, తెలుగు వాగుల మెదలి!! -
జీవన రథం
కవితా కేతనంతో,,
భావనోద్రిక్త మనోసారథితో
జవసత్త్వ, ఊహాసత్త్వ
పవనాశ్వాలతో
వచ్చి ఆగింది క్షణకాలం! -
రహదారుల కూడలిలో,
క్రాస్ రోడ్స్‌లో!!! -

(భారతి, డిసెంబర్, 1972)

# ఆవేదన

1 శిల్పసుందరీ !

నీ తాళమ్ములు మూగవోయినవి, నీ, నీ మద్దెలల్ నృత్తవే
ళా తీవ్రత్వముడించి కోన్నవి, కళాలాస్యమ్ములంతమ్ములై,
నీ తారుణ్యము కాలగర్భమున నిర్జీవమ్మునైపోవ, దే 1
వీ! తాదాత్మ్యము జెందినావె? శిలవై, విన్యాసరాహిత్యవై!

నీ వలుకుల్ వినంబడునొ? నీమృదులాధర లాస్యసంపదల్
తీవులు చుమ్మచుట్టునొ? సతీ! పద చాలన మాధురీగతిన్!
మైపులకల్ వహించునొ? విశాలవిలోచన! దివ్యభంగిమ
ప్రాపితనృత్తవైభవము బాయునొ? హత్తిన మెత్త గుండియన్! 2

ముగ్ధ మోహన చుంబన స్నిగ్ధ మధువు,
అధర ఫలకమ్ము నందున బదిలపఱచి
గత రహోరమ్య భావసంస్మృతిని దవిలి,
అద్దమఱచేత బూనెదో;? ముద్దరాల! 3

నీ కరమింతలింతలుగ, నీ పదమంతలు నంతలంతగా,
నీకనుగొల్కు బిల్కులుగ, నీ కుచయుగ్మపు వంపుసొంపులన్
భీకర వృత్తి దున్మిన- నిమీలిత నేత్ర! హృదంత రాళముల్
వాకలుగట్టి శోక రసవాహిని! గద్గద ముయ్యెకంఠమున్! 4

మూగవియంచు నెంతురు విమూఢులు! నీశిథిలాల ప్రోవులో
దాగిన శిల్ప మూర్తులను, దాచిన దాగని నృత్య రీతులన్
రాగము, తాళమున్ లయయు రంజిల, దివ్య మనోజ్ఞ గీతాలన్
స్వాగత మిచ్చు శిల్ప రసభామినులంచు నెఱుంగ లేరొకో? 5

2. నందీ!

నీ చెవి గోసినారు! రమణీయ ఘలంఘల కంఠ ఘంటికాం
సూచిత సూత్రవైభవము స్రుక్కడగించి, త్యజించినారు! నా
రాచమువోని, శృంగ మధురాగ్రము వమ్ముగ జేసినారు, సం
కోచములేక, నీదుకనుకోసలు శూన్యము జేసినారహో! 6

పరమేష్ఠి జగదంబ పరవశమ్మునవేగు
మూపురమ్మది నేడు మ్రుక్కలయ్యె!
రజతాచల స్వచ్ఛ రమ్యసానువులందు
క్రుమ్ములాడెడి కొమ్ము వమ్మునయ్యె!
వీరభద్రావేశ విహరణసమయాన
విదలించుఖురమద్ది విదళితమయె!
ప్రమథాదిగణముల ప్రథమ శ్రేణీ చిహ్న
ముత్తుంగ వాలమ్ము చిత్తునయ్యె!
తల్లి కరస్పర్శ పులకించు పుల్లతనువు
కర్కశాఘాత వ్రణములకటకుదేలె!
నీ వినీల దృగంతాల తీవియెల్ల
కాలగర్భాన దైన్యసాకల్యమయ్యె! 7
(రామప్ప శిథిలదేవాలయాలను సందర్శింపగా కలిగిన ఆవేధన)

1 శిల్పసుందరి 2 నంది

(భారతి, మే, 1973)

# స్వరలహరి

ఊహావల్లకీతంత్రి
కవితా కోమలాంగుళీ
స్పందనలో
నినదించిన
భావనా జ్యోత్స్నాలహరి,
నా స్వరలహరి!! -
ముగ్ధ శిశు మందహాసంలో
స్నిగ్ధారుణ రాగాలను,
మాతృస్తన్య మధువులను,
నేత్ర పర్వసౌందర్యరాసులను,
ఒలికించిన
మందహాస లహరి,
నా స్వర లహరి!! -
వికసించిన సుమబాలల
ముకుళింపని కోరకముల
చిగురించిన కోరికల
వెలిదార్చెడి
భ్రమరగీతి,
మధువు లొలుకు
తొసరి తొసరి, -
నా స్వర లహరి!! -
తెలిమర్వుల వయసు పొంగు,
సెలయేరుల మనసు పరుగు,
పుడమి కడుపు పొత్తిళ్ళలో,
కడలి బాహుబంధాలలో,
సస్యశ్యామల గీతమై,
వినీల రమ్యసాగర తరంగమై,
వినిపించిన,
ప్రణయమోహన
రాగనిర్ఝరి, -
నా స్వర లహరి!! -

నిశాంత రమణీయ
ప్రశాంతిలో,
దిశాంత వినీల
సుందరాకాశంలో,
పండువెన్నెల పిండిపోసిన
నిండు సుధాలహరీ స్నాతులై
చాతక ద్వయం
జుట్టి త్రేన్చిన,
ఆనందభైరవీ రాగాలాపన, -
నా స్వర సంకల్పన!! -
పుడమి కాంత, ఋతుస్నాత, -
జడలు సుంత తడియారక,
రూప, గంధ ప్రాపితయయి,
పుష్ప విభవ శోభితయయి,
భానుకిరణ పులకితయయి,
జాను తెలుగు మేళవించి,
కూని రాగమాలపించి
ఒలికిన
కల్యాణీ రాగం,
చిలికిన
మధురానురాగం,-
నా స్వర సాగరం !! -
చలిత వృక్షాగ్రాలపై
కలిత వనీ దరహాసంలా,
లలిత, లలిత జ్యోత్స్నా ప్రసారం -
పులకిత యామినీ మధురగానంలా
కాననాంతర సంచలిత
పికీ కుహూగాన మాధుర్యం
హృదయ విపినాంతర
మృదుమధుర గళాంతర చలిత
కవితా కోకిలా రావం, -
నా స్వర స్వభావం !! -
ధమ్మిల్లంలో తారకలు,
నెమ్మనంలో చంద్రికలు,
విరబోసిన కబరీ భరంలా
వినీలాంబరం,
అరవిచ్చిన కలువలా,

ముఖారవిందం,
లజ్జాపిహిత నూత్నవధువులా,
ప్రజ్ఞాసహిత, పరిణీత మధువులా
నిశారమణి హృద్గీతం,
ఆశారమ్య సంగీతం, -
నా స్వర వినిర్గత సంగీతం !! -
గగనాంగన,
దిగంతాల వ్యాపించిన
నీలాంబుద కేశపాశంలో
తెలిమబ్బుల మల్లె పూగుత్తుల్లా,
తొలివెన్నెల జల్లు తేనె చినుకుల్లా,
తారకలు జీరాడే
శ్రావణ రాకా సిత హృదంతర
ప్రశాంత నిశీథినీ సంగీతం
నా స్వర బహిర్గత మధుర సంగీతం !! -
శతకోటి
దీనజన నేత్ర ద్వయాలు
నిరాశా, తిమిరాశ్రు
పూరితాలై,
విహ్వలించి,
మింటికేసి చూసి
చికిలించినప్పుడు; -
శతసహస్ర తారకా
నయనాలు,
సుదూర, తిమిరాశా
పరివృతాలై
విహ్వలించి
మంటికేసి చూసి
మిణుకు, మిణుకు మన్నప్పుడు, -
వినిపించిన,
నినదించిన.
రవళించిన,
అజ్ఞాత జీవన,
వేదనారవం, -
నా హృదంతర రావం !! -
నిశ్శబ్ద నిశీథినిలో

జడప్రకృతి, సడిచప్పుడులేక
కునికిపాట్లు పడ్డప్పుడు,
నిశ్చల కాసారంలో,
మత్స్య పుచ్ఛచాలనం
మటుమాయమై పోయినప్పుడు,
మందమలయ, శైత్య, పవన
తరంగాల వెల్లువల,
భంగరవాలు, అణగినప్పుడు;
చీకటులు ముంచెత్తి
ఆకులైన, కదలకున్న,
గహనాంతర,సుప్తవ్యాఘ్రి
నిడుపుటూర్పు, సడియైనను,
వినిపింపగ లేనప్పుడు; -
తిమిరమ్ములు, నింగినుండి
జడివానగ, కురిసి, కురిసి,
అవని సర్వమావరించి,
వెలుగులెల్ల మ్రింగినపుడు;
ఆర్తజనుల, గుండెలన్న
కుంపటి తడిబొగ్గులందు,
రాజి, రాజి, మింటి కెగయు,
దైన్య ధూమ మంబరాల
వ్యాపించిన, నట్టనడికి రేలప్పుడు;
మనసుకె
వినిపించినట్టి
సన సన్నని
అంతరాత్మ
చిన్ని ఎలుగు, -
నాదు గొంతు నణగలేని
మూగ మూల్గు! కయిత ఎలుగు!! -
ఊహా వల్లకీ తంత్రి
కవితా కోమలాంగుళీ
స్పందనలో
నినదించిన,
భావనా జ్యోత్స్నాలహరి
నా స్వరలహరి !!! -

(భారతి, డిసెంబరు, 1973)

# విపిన విప్లవం

హరిత పత్రాల నీడల మాటున,
దీర్ఘశాఖాబంధాల చాటున,
గుబురులై చొరరాని పొదల అట్టడుగున,
విస్తృత, పరిధీకృత, వట కోటరాన,
అణగి మణగిన అంధకారం;
వెలికి రాలేని విషాద తిమిరం -
ఎదురుతిరిగిందా కటిక చీకట్లో!
విప్లవ ముణికిందా నిశ్శబ్ద నిశీథినిలో !! -
నును లేత చివుళ్ళతో,
నవకుసుమ లాస్యవిలాసంతో,
నూత్నపికీగళాత్త మనోజ్ఞ కుహూరావంతో,
స్వాగత మిస్తుంది మాకందం - రాగానే వసంతాన్ని !
పలిత కేశాలైన పండుటాకుల్ని,
సిగ్గు దాచిన ముదురు కోకల్ని,
వడలిపోయిన బెరడు పొరల్ని,
దులిపేస్తుంది మందారం - కోపాన కలుషితాన్ని !
దూరి దూరి నిద్దరోతుంది క్రౌంజిగురాకు,
గ్రీష్మాతపానికి జడిసి, జడిసి!
ఆకుపచ్చని జలీయంచు మేల్ముసుగులో
వెచ్చవెచ్చగా, సుఖశాంతంగా జీవశక్తులు ప్రసరింపగా రక్తనాళాల్లో -
కుమిలి, కుమిలి ఏడుస్తుంది ముదురుటాకు,
గుబురుటాకుల గుంపులో
ఉక్కిరి బిక్కిరై ఊపిరాడక, -
నవనాడులు స్తంభింపగా,
చీకట్లు విస్తరింపగా,
వెలతెలాబోయి, హృదంతరాళాలలో !!-
తొలిచిన్కు చల్లదనం
ఆషాఢ మేఘ వర్షోద్భుతం!
బాహ్యాంతరశుచి స్వరూపమై
పులుకడిగిన ముత్యంలా
ప్రకాశిస్తుంది నీరెండలో -

ఫలపుష్ప కాంత్యుపరితలం!
పాడిచిన్కుల
కించిత్ చైతన్యం......
తడిసీ తడియని
హృదంతర మాలిన్యం....
ఆకలి దప్పులు తీరని
వేదనా ధారాపాతం,
నిరంతర కల్మషాన్ని
బాహ్యంగా,
నిష్ఠ దరిద్రాన్ని
అంతరంగా
భరిస్తుంది
నిరుపేదలా - వర్షాన -
వృక్ష కోటర మూలాంధకారం !! -
అణగి మణగిన
అంధకారం,
వెలికి రాలేని
విషాద తిమిరం -
ఎదురు తిరిగిందా
కటిక చీకట్లో!
విపిన విప్లవ
ముణికిందా
నిశ్శబ్ద
నిశీథినిలో !! -

(రంజని, 1973)

# మలుపు

నిశ్శబ్దంగా నిస్త్రాణగా, నిశ్చలంగా
పశ్చిమంలో పడుండే
ఈ తలపులేని మంజీర నా కొద్దు!
ఈ మలుపులేని నిర్ఝరి నాకొద్దు!
అంతర్మథనంతో, ఆంతరచలత్ ఝరీ ప్రస్థానంతో
నిరంతర జిజ్ఞాసా తరంగాలతో
చిరంతన ప్రజ్ఞా శీకరాలతో,
గిరులదూకి, తరుల దాకి,
గహనాలు గడచి, పహరాలు నడచి,
సువిశాల భావ మైదానంలో
ప్రవిమల చింతనా సస్య శ్యామలంలో
పరవళ్ళు ద్రొక్కి, ఒరవళ్ళు నిలిపి,
తలపులు పులకించి, వలపులు పండించి,
వినూత్న పథగామినియై,
నిత్య చైతన్య స్రవంతియై,
గోదారి పాయల్లో, భద్రాద్రి ఛాయల్లో,
విజ్ఞాన సాగరాభిముఖంగా,
మనోజ్ఞ శిల్పరేఖాచ్ఛ వాసంగా,
గలగలా పారే సెలయేరు,
కిలకిలా నవ్వే తొలినీరు,
తూరుపు తొలివెలుగుల్లో
మారుపు మలి తరగల్లో
వెన్నెల కురిసే తీయనితలపు
కిన్నెర తిరిగే మాయని మలుపు
అదీ,
నే కోరేది,
ఈ, నా,
ఉగాది !! -

(రంజని, మే, 1974.)

# నా కవిత

ఛందం
నా భావనా విహంగానికి
రక్త సంబంధం !
ప్రాస
నా కవితా హృదయానికి
జీవన శ్వాస!
యతి
నా రచనా వ్యాసంగానికి
తపోనియతి!
ఛందోబద్ధగతి
అందమైన
నా కవితా ఝరీగతి!
ప్రాస
కుసుమాకృతి!
రసవ్యంగ్య ధ్వని
సంకేతాకృతి!
యతి
పాల్లు పోని సంగతి!
అతి రమణీయార్ధ
ప్రతి పాదక సుకృతి!
ఛందస్సులు
నన్ను బంధింపవు.
అందాల పథాలలో
మధురాతి మధురంగా
విహరింపజేస్తాయి!
ప్రాసలు
నన్ను ప్రశ్నింపవు.
ప్రాకృత భావ పరీమళాన్ని
సహృదయాలలో వెదజల్లుతాయి!
యతులు

నాకు నియతులు కావు.
యాతా యాత ' కావ్య సౌరభ
లహరిని, రసోన్ముఖంగా
ప్రవహింప జేస్తాయి !
నా ఛందం
భావ ఝురీ
లయాను బంధం!
నా ప్రాస
నిత్య నూతన
జీవితాను ప్రాస!
నా యతి
సర్వమానవ
శ్రవణానంద సంగతి!
నా గీతం
శతకోటి మానవ
హృదయవల్లకీ సంకేతం!
నా గేయం
అతిలోక ప్రణయ
కుసుమ పరీమళ ధ్యేయం!
నా గళం
ఆనంద, వేదనాతీత
నాదస్వర సమ్మేళనం!
నా కవిత
నిత్య నూతన
భావనా కుసుమ
సౌరభ పరీవక్వత !! -

(భారతి. నవంబరు, 1974.)

# చీకటి ముసుగు

బొట్టన వ్రేలి నుండి
నడి నెత్తి దాకా
తన్నాను
ముసుగు,
వెలుగు భరింపలేనని!
విడిచిన శ్వాసనే
మరల పీలుస్తున్నాను,
ఉదజని పుక్కిలించిన
వెలిగాలి పడదని!
వలయాలుగా
చలిగాలి
గిలిగిలి పెడుతుంటే
దుప్పటిలో
తలదూర్చాను
తప్పించుకొందామని!
తిమిరాలు
భ్రమియిస్తూ,
మమకారాలు
పెనవేస్తూ
ముసుగులో
ముచ్చట్లు
విసుగు లేదనుకున్నాను!
నిండా మునిగినోడికి
చలే తెలీదని
భలే మురిసిపోయాను !
కానీ, -
అజ్ఞానం
ఆపాదమస్తకం
ఆవరించిందనీ, -
విజ్ఞానం
కూపస్థ మండూకంలా

కలలు కంటుందని, -
అసమానత్వం,
అంధకారంలా
ఆక్రమిస్తుందని, -
దురహంకారం,
కార్చిచ్చులా
దహిస్తుందని,
నల్లని ముసుగు
తెల్లని వదన సత్యాన్ని,
కప్పివేస్తుందని, -
చల్లని ఈదురు గాలి
ఉల్లంలో
కరుణా కవోష్ణాన్ని
ముంచివేస్తుందని, -
'చీకటి ముసుగు'లో
ఆకలి దవ్వులు
సమూలంగా,
నశిస్తాయని, -
తెలిసికొనేలోగా,
మెలకువ వచ్చి,
కన్ను తెరిచే లోగా,
నిలిచి పోయింది
నా ఊపిరి !! -
ముసుగులో
ముసిరిన
మసక చీకట్లలో
ఉక్కిరి బిక్కిరై !!! -

(భారతి, మార్చి, 1975.)

# ఎందుకు నాకీ తుది?

ఎందుకు
నాకీ తుది?
ముందుకు
పోనీదా
గత విధి?! -
ప్రశాంతాకాశ
చిత్రఫలకంలో,
వసంతారామ
లతాంతాలలో,
నిరంతర మేదో
అదృశ్య హస్తం
చిత్రిస్తున్న
రంగుల మబ్బుల తునుకల
కంతమేదో మరి? -
వినీల సాగర
గర్భాంతరాలలో,
అలల ననంతంగా
సృష్టించి,
తీరాల కపారంగా
తెలినుర్వుల
ప్రసరించే కడలి
కంతేదీ మరి? -
శిశిర ఋతు కుహరంలో
వడలిన పత్రాలను
విసర్జించి,

ముసలిదైన తరుతన్వి
వాసంత పికీ
కుహూ నాదంలో
పచ్చని నునులేత చివుళ్ళు
తొడిగి,
నవయౌవనియై
నవ్వుల పువ్వులు
నిరంతరం
వర్షించటం లేదామరి? -
అనంతకాల ప్రవాహంలో
తిథులు, వారాలు, మాసాలు,
వత్సరాలు, యుగాలు, కల్పాలు,
నిరంతరం చక్రభ్రమణంలా
మరలి రావటం లేదా మరి? -
చారిత్రక బృహత్కథా
శ్రవణంలో,
ఆరని నెత్తురు మడుగులు,
తీరని అసూయాద్వేషాలు,
మారని కులమత తత్త్వాలు,
మళ్ళీ మళ్ళీ
వినిపించటం లేదామరి? -
గుళ్ళో గంటలు
మళ్ళీ మళ్ళీ
వినిపిస్తుంటాయి!
కళ్ళల్లో
సూర్యచంద్రులు,
దివారాత్రాలు
కనిపిస్తుంటారు
మళ్ళీ మళ్ళీ!
వెలుగు, - చీకట్లు, -

తెరల్లా తరలి
పోతుంటాయి.
వెళ్ళి నట్లే వెళ్ళి, మళ్ళీ
మళ్ళీ, వస్తుంటాయి
ఋతు సంకేతాలు!
ఈ విశాల విశ్వంలో
త్రికాలా తీతమైనవి
ఎన్నో ఉన్నాయి!
ఈ విచిత్ర ప్రపంచంలో
నిర్విరామంగా సాగేవి
ఎన్నో ఉన్నాయి!
ఈ అనంత త్రిభువనంలో
నిరంతరంగా పయనించేవి
ఎన్నో ఉన్నాయి !
కానీ, -
వెళ్ళితే తిరిగిరాదు
మానవ జీవన రథగమనం!
మళ్ళితే తిరిగిరాదు
వయో భావ చంక్రమణం!
పల్లంవైపే
పయనిస్తుందీ
మానవ జీవనదం!
ఉల్లం ఊతగా
తిరుగులేని మలుపులు
పోతుందీ
భావనా నదం!
శాశ్వత భావనా జలధీ
తీర సికతా తలంలో
క్షణికంగా
అల్పిష్టంగా

ముద్రవేస్తూ
కాలాతీత
తరంగోద్ధృత శీకరంలో
తిరిగి, తిరిగీ
చెరిపేయ బడుతూ,
అదృశ్యమౌతుందీ
అశాశ్వత ఊహామానవ
శిశుపాదపల్లవం!
అనంత కాలసాగర
హృదయాంతరంలో,
తనంత తానే
బిందురూపంలో
లీనమై పోతుందీ
మానవ జీవన
వాహినీ పథం!
పునర్జన్మతో
పునరావృతమౌతుందా
జీవితం?
మనో బుద్ధ్యహంకారాలతో
పునీత మౌతుందా
జీవనం?
ఎందుకీ వైవిధ్యం?
ఎందుకీ వైరుధ్యం?
ఎందుకు మనిషికీ అంతం?
ఎందుకు మానవ జీవితానికీ సమాప్తం?
ఎందుకు నాకీతుది?
ముందుకు పోనీదా గతవిధి?! -

(భారతి,ఆగస్టు, 1975)

# జీవన మధురిమ

సర్వర్తు భావనా సమైక్యమై
వేదనా తీత భావ సమున్ముక్తమై
ఉద్వేల కవితాస్రవంతి
చలత్తరంగ తేజో విరాజమానమై,
అపూర్వానంద ఘంటికా ఘలంఘల
రవాను సంధానమై -
వెలసిన,
ఒక అనిర్వచనీయ
భావనా వాసంత పికీగళ గీతం
ఈ జీవన సంగీతం !-
ఇది -
విధి పన్నిన ఉరులూ కాదు!
మదినల్లు కొన్న చదరంగమూ కాదు!
ఇది - ఆటు పోటుల చలించే
జీవన వార్నిధి!
సుఖ దుఃఖాల జ్వలించే
మానవాంభోనిధి!
కన్నీళ్ళూ, కంటకాలూ
పన్నీరూ, పూలపాన్పూ
వియోగం, విప్రలంభం,
హాసం, సుధామధుర దరహాసం,
అన్నీ - మేళవించిన ఒక అపూర్వానుభూతుల రసాయన సమ్మేళనం!
ఒకానొక విషాదభావనా మధుర సంయోగం!
ఒక అనన్య బాధా మోద చిత్రవిచిత్ర సంపర్కం!
నిరంతరంగా, నిర్విరామంగా, యుగాలుగా, కల్పాలుగా,
అనంత కాలవాహినీ గత బుద్బుదంగా

[illegible] చలితరంగా, -
సాగిపోయే సంస్కృతి పథం, ఈ జీవన పథం!
ఊగిపోయే జాగృతీ పథం, ఈ జీవిత మనో రథం!
బాధావల్లకీ, గాధా మధుర నిక్వాణం
ఈ జీవిత కథనం !
అనంత సంశయానాద [illegible] తరంగ సంచలనం
ఈ జీవిత [illegible] ! -

(భారతి, డిసెంబరు, 1975)

# భావనా కౌటిల్యం

మిలా మిలా మెరిసింది!
గలగలా పారింది!
కిలకిలా నవ్వింది! -
తొలిపసిడి రేకయని
తొంగిచూచాను!
సెలయేటి హోరని
చెవులు రిక్కించాను!
కలికి వలపుల పొంగు
మదిని దలచాను!
హరివిల్లు విరిసింది!
స్వరలహరి దొరలింది!
విరిమల్లె పూసింది!
సప్త వర్ణాలు నింగిలో
మెరిసె ననుకొన్నాను!
సప్త స్వరాలు నేలపై
పలికె ననుకొన్నాను!
సుప్తసౌరభాలు గాలిలో
తేలె ననుకొన్నాను!
ఓంకార మలరింది!
హుంకార మొలసింది!
ఝుంకారధ్వని వినసైంది!
వేదోక్త పూజావిధాన
మనుకొన్నాను!
బోధి సత్త్వుని ధర్మ బోధ
యనుకొన్నాను!
మాధవాహ్వాన, వాసంతగీత
మనుకొన్నాను!
కోకిల గొంతెత్తి కూసింది!
కేకి పురివిప్పి ఆడింది!
ఆకసం మొయిలు గ్రమ్మింది!
పంచమస్వానాలు పలుకు

ననుకొన్నాను!
పంచ బాణుని వైరి లాస్య
మనుకొన్నాను!
సంచలిత శంపలై వెలుగు
ననుకొన్నాను!
తలపులు విరులులా పూచాయి!
గళములు కోకిలలా విచ్చాయి!
ఫలకాలు మనోజ్ఞంగా వెలిసాయి!
సాహితీ నందన పారిజాతం
పరిమళిస్తుందనుకొన్నాను!
సేవార్ద్రభావ రమణీయ గానం
వినిపిస్తుందనుకొన్నాను!
ఊహా మనోజ్ఞ చిత్రం నయనాల  ప్రతిఫలిస్తుందనుకొన్నాను!
సంకెళ్ళు వడలి విడివడ్డాయి!
శంకలు సడలి మాయమైనాయి!
లెంకలు మనపై పొంగి పోయినాయి!
స్వాతంత్ర్యం సర్వతోముఖంగా
వికసిస్తుందను కొన్నాను!
కుతంత్రం సంఘంలో కుప్పలా
కూలి పోతుందనుకొన్నాను!
ప్రజా స్వామ్యం పచ్చనిపంట చేలలా
విరిసి, మెరుస్తుందనుకొన్నాను!
కానీ, -
ఒక తెల్లుపూవు తెల్లగా
నిన్న విరిసింది!
ఒక కల్లుపాక మెల్లగా
నేడు వెలిసింది!!
ఒక హల్లు లేని అచ్చు చల్లగా
రేపు నిలిచింది !!! -

(రంజని, 1975)

# ఏదీ నా ప్రేరణ

ఏదీ నా ప్రేరణ?
ఏదీ నా కవితా మనోనిరీక్షణ? -
తొలి వెలుగు రేకల, తెలిచి వాకిళ్లలో
చిలిపిగా తొంగిచూసే, చీకటి క్రీగంటి చూపులా?
మలిసంజ, మసక చీకట్ల, నీలి చివళ్లలో .
వలపు జాబిల్లి చిందించిన, వెన్నెల వెలది చిఱునవ్వులా?
ఎదలువ్వెత్తుగా పొంగి పొరలే వేళలో
మదిలోతుల నెగసిపడే,
నిప్పుకొండలుమిసే, 'లావా' లా? -
గుండెలవిసే దుఃఖబడ బాగ్ని శిఖలలో పండువెన్నెల చుంబించే,
ఆనంద జలధీ తరంగాలా? -
ఊహాగగన యాత్రా విహారానందంలో
వాస్తవ జీవన పథ కంటక
నిత్య బాధా గాధా స్మృతులా ? -
అట్టడుగు అగాధాలలోనికి
మనసు నెట్టబడ్డ సమయంలో
చిట్ట చివరి మలుపున తళుక్కుమన్న
ఆశా భావజ్యోత్స్నలా? -
వైవిధ్యం, వినూత్నత్వం, రసాత్మత
వెల్లివిరిసే, కళాక్షేత్రంలో,
నైరాశ్యం, సంకుచితత్వం, నిరీహ
పండించిన -
సాంస్కృతిక గౌతమీ జల విజృంభణలా? -
తిరుగులేని, సుడిగుండపు వలయాల
కొట్టుమిట్టాడి, బరువైన తుది ఘడియల్లో
మఱలి వచ్చిన కొస ఊపిరి
గుండెల్లో నింపిన -
కవితా పినాకినీ పీయూషాలా? -
వాసంత వికసిత, రసాల కిసలయాలు
మెసవిన, మృదుమధుర కోకిలా రవంలో
ఆషాఢ మేఘవ్యూదంతర, తీవ్ర వర్షా గమసూచక,

దౌర్జన్య గర్జనలా? -
శిశిర, హేమంత, - శీతలానిల ధాటికి
స్తంభించిన జడప్రకృతిలో
గ్రీష్మర్తు వేళా కవోష్ణపులకిత
మల్లికాసుమహృదయ
చైతన్య వికాస సౌరభాలా? -
స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం
పెల్లుబికిన జాతీయ భావనలో
సంకెళ్ళు, స్వార్థం, విధ్వంసక భావం
అట్టుడికే
సంఘ విద్రోహక చర్యలా? -
అస్వతంత్రంగా,
అజ్ఞాతంగా,
అమానుషంగా -
విహరించిన
భావనా హర్యక్ష హృదయంలో
స్వేచ్ఛా మానవ,
సౌహార్ద్ర భావ ప్రకటనోద్ధృతంగా
తలయెత్తిన
కవితా సింహ గర్జనలా ?-
ఏదీ
నా ప్రేరణ??
ఏదీ
నా కవితా,
మనో నిరీక్షణ??! -

(భారతి, మార్చి, 1976)

# శరత్ జ్యోత్స్న

కన్నుల కందంగా, మిన్నుల మందంగా,
బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని
ముగ్ధలా కళ్ళింతలు చేసుకొని
పరుచుకొంది శరత్ జ్యోత్స్న !
వెన్నెల తెలివెలుగుల్లో
మన్నుల తొలినలుపులున్నాయని,
కన్నుల నీలి తుదలల్లో
మిన్నుల తెలిమబ్బు రేకలున్నాయని.
అందంగా ఆకాశ మంతటా నిండిన
వెన్నెల వెల్లువల్లో,
మందంగా సాకార శోకమై, నిండిన
నీలాల నింగి తొంగి చూచిందని,-
తెల్లగా శరత్తున విరిసింది వెన్నెల !
వెఱ్ఱిగా నభస్సున నీలిమలై విరిసింది వెన్నెల !! -
కడుపుకాలుతున్నా, అడుగు తడబడుతున్నా
మడుగు ధోవతి తోనే నడక సాగించాలని, -
దారిద్ర్యం దుర్భరమైనా, సరదాలు చంపుకోలేని
పరదాల మధ్య తరగతి ప్రతినిధిగా సరిక్రొత్త జీవితం తొలగి వెలిగించాలని, -
'ఫాల్స్ ప్రిస్టేజ్'తో , 'రూల్స్' సంకెళ్ళతో
సంఘనైతిక ప్రమాణాలన్నీ,
గంగలో కలిసి పోయాయని, అంగలార్చే
సగటు మనిషితో తాదాత్మ్యం సాధించి
పెరిగే అప్పులు, తరిగే ఆస్తులు
చాలీ చాలని జీతాలు,
కూలీనాలికి పోలేని పరిస్థితులు,
దినగండం నూరేళ్ళాయుష్షుగా
మనుగడ సాగించాలని, -
మిథ్యా జీవన ప్రమాణాలకు, మధ్యస్థమైన
జీవన పథ సంయమనానికి,
అధ్వాన్నం కాబోయే భావికి, సిద్ధాన్నమైన నిరుద్యోగానికి
బద్ధానురాగం చూపించాలని

మురిసే వెట్టి నాగన్న - కురిసే
నిర్జీవమైన నవ్వులా - పరుచుకొంది
పువ్వులాంటి శరత్ జ్యోత్స్న !! -
'కాంటాక్ట్ మెన్ గా, 'హెవీ
కాంట్రాక్ట్' లు లాగించే మేధావి
ఫారిన్ కారులో, విలాసంగా వెళుతూ
జోరుగా 'సిగార్' ముట్టించి,
దట్టంగా వదిలిన, తెల్లపొగ మబ్బులా -
తెట్టెలు, తెట్టెలుగా, చుట్టుకొంది
పరిసరాల్ని శరత్ జ్యోత్స్న !! -
రాజకీయ చదరంగంలో,
రాజులనే తరాజులు చేసే
'కింగ్ మేకర్' గారి నెరిసిన జుట్టులో
రంగువెలిసి కనిపించిన, పలితకేశాల
మంద మంద హాస సంచలనంలా -
సందడిలేని ఆకాశ వదనాన్ని
అందంగా ఆవరించింది
సుందరతర శరత్ జ్యోత్స్న!! -
చీకటే గాని, వెలుగే లేదని,
ఆకలే గాని, అన్నమే లేదని,
సణిగే సగటు మనిషికి,
మిణుగురులా తోచింది
వినువీధిలో శరత్ జ్యోత్స్న !!
రెక్కాడితేగాని డొక్కాడని,
రైతులు, కూలీలు, నిరుపేదలు,
ప్రక్కలో బల్లెంలా ఎదిగి కూర్చున్న
మధ్య తరగతి కన్యాపితలు,
నక్క జిత్తుల రాజకీయవాదుల
మధ్య నలిగి, చితికి పోయిన దేశ భక్తులు,
కుక్కల కన్నా హీనంగా చూడబడే
స్వతంత్ర భారత నారీ జీవచ్ఛవాలు,
ఎక్కడా బ్రతుకు తెరువు దొరకని
నిరుద్యోగ సోదరులు.
మిక్కిలి సంతానంతో
సతమత మయ్యే బహుకుటుంబీకులు,
ఈ దగా పడిన తమ్ముళ్ళు,
ఈ దరిద్ర నారాయణులు,

ఈ దుర్దశావిభావరీ సంచారులు -
లోతుకు పోయిన కళ్ళతో
నూతిలో నుంచి వినవచ్చే గొంతుకలతో, -
ఎండిన పెదవులతో
తడారిన గొంతుకలతో,
పండిపోయిన తనువులతో,
మనోస్మశానంలో
వైరాగ్య సంచారం మాని -
ఏదో ఉజ్జ్వల భవిష్యత్తు కనుచూపు మేరలో ఉందని,
ఏదో ఒక నాడు ప్రొద్దున
తమ జీవిత వసంతాలలో
వెలుగు రేక తళుక్కుమంటుందని,
వేచి చూచిన
ఆశాదృగంత కాంతిలా,
దాచి విరిసిన
జీవన ప్రశాంత హాసంలా,
పరుచు కొంటి
ఊహా వినీలాంబరంలో
సరళ, ధవళమైన
శరద్రాత్రిలో
మురిపించిన,
వెలుగులు ముమ్మరంగా
కురిపించిన -
శరత్ జ్యోత్న !!! -

(రంజని, జూలై 1977.)

# చీకటీ ! నీ వెలుగేది?

చీకటీ !
నీ వెలుగేది?
ఆకలీ!
నీ పలుకేదీ? -
కల్పాలు, యుగాల వెనక దాగిన కాఱుచీకట్లో -
అనల్ప జ్యోతిర్మయంగా,
'అహం బ్రహ్మాస్మి' - అన్న ఉపనిషద్వాక్యంగా
వెలిసావా ?
చీకటి యుగాలు, అతియుగాలు
మట్టీ, మశానం - అని
వచ్చినెత్తురు గ్రోలే, పాశవికులుగా, ఆటవికులుగా
ప్రపంచం సర్వం మసలే తరుణంలో -
'అన్నం పరబ్రహ్మం' - అని
భరత వర్షంలో,
ఆకలికి మూల సత్యం పలికావా?
శాస్త్ర విజ్ఞానం, సంఖ్యా పరిజ్ఞానం
శైశవ దశలో తప్పటడుగు లేస్తున్నప్పుడు -
శూన్యానికీ, అనంతానికీ
మధ్య వారధిలా -
'సున్న' (జీరో) - ని సృష్టించిన
మేధావి కన్నులలో వెలుగై పలికావా?
నియంతృత్వం, కర్కశత్వం, అతివాద తత్త్వం
పొంగి పొరలుతున్న పిదపకాలంలో.
శాంత్య హింసలు, ప్రణయ కారుణ్యాలు -
మతోన్మాద గాఢాంధ కారానికి
నవోదయాలన్న -
గౌతమ బుద్ధ పరివ్రాజక నిర్వికల్ప
మందహాస సుందరంగా వెలిసావా? -

క్షుద్రశక్తులు, విభిన్న వాదాలు,
నాస్తిక విజృంభణాలు, శాక్తేయాలు,
కోకొల్లలుగా, పుట్టగొడుగుల్లా
నేలనాలుగు చెరగులా విరిసి,
అసంతృప్తి ప్రబలిన అంధకారయుగంలో -
అద్వైతామృతాన్ని
సౌందర్యలహరీ ప్రకాశంతో
ఆసేతుశీతాచల పర్యంతం పంచిపెట్టిన
ఆదిశంకరుల ఆవేదనారూపంగా వెలిసావా?
రెండు వందల ఏండ్ల పైచిలుకుగా
తెల్ల దొరల పరిపాలనలో
తలలతో పాటు తలపులు పండిన
బానిస ప్రజల మసక **మసక** కన్నుల పొరల్లో
స్వాతంత్ర్య శంఖారావం పూరించి
ఉత్తేజితంచేసిన,
మహాత్ముని బోసినవ్వుల తొలి తెలివెలుగులా
దేశమంతా విరిసి, మురిసి పోయావా?
పరపాలనలో భ్రష్టుల్లా, అస్వతంత్రులై
పడిఉన్న మూఢ ప్రజానీకానికీ,
తెల్లదొరల ఎంగిలి కూడే పంచభక్ష్య పరమాన్నమని
మురిసే తొత్తులకీ,
వెరవక, ఎదిరించి, గుండె నిబ్బరంతో
మాతృ సేవలో వీరోచితంగా పోరాడి
మరణించడమే ధ్యేయమని -
ఎలుగెత్తి చాటిన అచంచల దేశ భక్తులు.
అమరులూ - భగత్ సింగ్, అల్లూరిల -
పవిత్ర రక్త నిర్ఝరీ తరంగరావాల
ప్రతిధ్వని రూపంగా వెలిసావా?
మూడు వందల ఏండ్లుగా, ముమ్మరంగా
ముసిరిన చీకట్లను,
స్వతంత్ర భారతావనిలో
ముప్పై ఏళ్ళలోనే తొలగిస్తారని.

వెలుగులు తొంగిచూస్తాయని
భ్రమించిన వెఱ్ఱి భారతీయుని
పీడకలలా మిగిలిపోయావా? చీకటీ! -
అత్యాచారాలకు, అక్రమాలకు, అధర్మాలకు
అసహనం, ఆగ్రహం, ఆవేశం - చూపలేని
భృత్యాను భృత్యులై పోయిన
అసమర్థుల భావనా దారిద్ర్య చిహ్నంగా,
భారతీయ మనోసంక్షోభదావానల
రేఖాంచలంగా
మిగిలి పోయావా? ఆకలీ!
చీకటీ!
నీ వెలుగేది?
ఆకలీ!
నీ పలుకేది? -
'ఓటు' వేయడంతోనే
పౌరుని విధ్యుక్తధర్మం ఆగిపోలేదు!
దాటవేసే మాటలాడడంతోనే
ప్రజాప్రతినిధి బాధ్యత తీరిపోలేదు!
'తాన తందాన' పాడే వందిమాగధుల
ఆట కట్టిస్తే చాలదు!
ఆనపెట్టినట్లు, ఆడిపాడిన
అధికార దుర్వినియోగాన్ని
ఉరికంబమెక్కిస్తే చాలదు!
అవినీతిని, అస్వతంత్రను, అన్యాయాన్ని, అక్రమాలను
ఎక్కడైనా, ఏనాడైనా, ఏరూపంలో నైనా,
తలెత్తితేచాలు -
కూకటి వ్రేళ్ళతో కూలద్రోసే
గుండె ధైర్యం కావాలి!
సత్యాన్ని, న్యాయాన్ని, సమత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని
అపురూపంగా, పంచప్రాణంగా పరిరక్షించుకొని,
అందరితో సంపదలను ఆనందంగా పాలుపంచుకొనే

ప్రజాస్వామ్యం - పచ్చగా పదికాలాల పాటు
వర్ధిల్ల జేసే పట్టుదల కావాలి!
అజ్ఞానాన్ని, అంధకారాన్ని చీల్చి
వెలుగు వెల్లువలా ఉరికే
యువ కావేశ భానోదయం కావాలి!
విజ్ఞానాన్ని, వివేకాన్ని, సంస్కృతినీ
వినయంతో, సౌజన్యంతో, సంస్కారంతో
పంచియిచ్చే - నవతాభావ కవితా విప్లవం కావాలి!
పాలించేది ఏ పార్టీఅయినా
ఆలించేది బీదల గోడుగా ఉండాలి!
శాసించేది ఏ చట్టమైనా
ఆసించేది అట్టడగున పడిఉన్నవారి
భవితవ్యమై ఉండాలి!
చేసేది ప్రజాప్రభుత్వమైనా
చేయించేది చైతన్య ప్రజాశక్తి అనీ,
వ్రాసేది వచన కవిత్వమైనా
వ్రాయించేది సమసమాజ సంక్షేమ వాణి అనీ,
బోధించేది పాశ్చ్యప్రణాళికలైనా,
సాధించేది వ్యక్తి మనోపూర్ణ వికాసమనీ,
కండ్లు తెఱచి, చెవి యొగ్గి
మెదడుకు చుఱుకుగా పనిచెప్పి -
అప్రమత్తతో, ప్రజానీకం
కలిసికట్టుగా ప్రవర్తిస్తేనే -
ప్రజాస్వామ్యం ఫలిస్తుందనీ,
స్వాతంత్ర్యం
సర్వతోముఖ వికాసమొందుతుందనీ,
తెలుసు కొన్ననాడే, -
ఈ దేశానికి - ముసిరిన చీకట్లు తొలగేది !
బాధ్యతాయుత పౌరునిగా
మలుచు కొన్ననాడే
ఈయువతకు - ఆకళ్ళు తీరేది!

గతాన్ని - గుడ్డిగా అనుకరించక,
శ్రద్ధగా, ప్రజ్ఞతో సింహావలోకనంచేస్తూ
వర్తమానాన్ని - అశ్రద్ధగా గాలికి వదిలేయక,
సమిష్టిగా పురోగమిస్తూ -
భవిష్యత్తును - పగటి కలల్లో తేలిపోనీక,
ప్రతిభావ్యక్తిత్వత్తులకే పట్టంగట్టూ,
పురోగమనానికి గట్టి పునాదులు వేస్తూ
సరిక్రొత్త ప్రణాళికలు
ప్రజాభ్యుదయానికే విరచిస్తూ.
సత్యాన్వేషణకు వెనుకంజవేయక,
న్యాయనిర్ణయంలో, అసందిగ్ధతకు, ఆలస్యానికి తావీయక,
చీకటిని చీల్చే జిజ్ఞాసతో, ఆకలినిరగిల్చే ఆవేదనతో -
బలంగా ముందడుగు వేస్తేనే
కలంతో జాతిని ప్రబోధిస్తేనే -
ఈ జాతికి పట్టిన గ్రహణం విడుస్తుంది !
ఈ యువతకు పుట్టిన రాచపుండు నశిస్తుంది !
అంత వరకూ -
దట్టంగా అలముకొన్న ఈ కాళు చీకట్లకు
వెలుగు లేదు!
అంత వరకూ -
క్రోధంగా బలిసిన ఈ పేద ఆకలికి
పలుకు లేదు !!
చీకటీ!
నీ వెలుగేది?
ఆకలీ !
నీ పలుకేది ?? -

(రంజని, జులై, 1978)

# వదన హృదయం

నా వదనం తెల్లన !
నా హృదయం నల్లన !! -
నా పలుకులు తెలిమల్లె పూలు!
నా తలపులు నల్లగలువ పూలు!
నా బాహ్య పథ గమనం సౌమనస్యసంయమనం!
నా హృదయ సంచలనం వైమనస్య విజృంభణం!
నా గళాంతర రావం వల్లకీ మధురానురాగం!
నా హృదంతర గానం ప్రళయ దుందుభీ నినాదం!
నా నయనాపాంగం నవమల్లి కాహాస వికాసం!
నామనో దృగంతం కామవాంఛా సౌరభేతి హాసం!
నా శ్రవణాంతరం భక్తి భావనానిభృతం!
నామేథో విహంగ విహారం రాగనిమగ్న నీలాంబర పరిభ్రమణం!
నా, జిహ్వాగ్ర నైశిత్యం -
నానా భక్ష్య రుచి మాధుర్య సన్నిహితం!
నా, హృదయ రంగ సన్నిహితం -
బహువిషయలౌల్య మకరంద రసానందం!
నా, నాసాగ్ర కాంక్షితం -
నవనవోన్మేష కుసుమసౌరభ తరంగం!
నామాన సానుబంధం -
పురాదుర్గావ కేతకీ సూన సౌగంధ్యం !
నా బహిర్దృష్టి -
సమసమాజ నిర్మాణ యోజనా వికాస పరిపుష్టి!
నా అంతర్దృష్టి -
అసమ వ్యవస్థా ప్రతిష్ఠాపనాంతర వృష్టి!
నా వదనం
తెల్లన!
నా హృదయం
నల్లన !! -

# మహారణ్య మధ్యంలో - I

హేమంతముగ్ధ జ్యోత్స్నా ప్రసారంలో,
నిశ్శబ్దం - నిశీథినీ వధూటిని,
గాఢంగా యెదకు హత్తు కొన్న క్షణాన -
తిమిరాలు తిరోగాములై,
గాలికదలక, ఆకులల్లాడక
అడవి, అడవంతా నిరీక్షణతో
కొస ఊపిరి బిగబట్టిన క్షణాన-
అర్థ రాత్రిలో అర్థ నగ్నంగా,
విహార యాత్రా విలాసంగా,
మహారణ్య పురాణాలు - విందామని,
మహావనీ విసర్గ సౌందర్యాలు - కందామని,
కదిలాను ఒంటరిగా, జడప్రకృతి నీడగా ! -
సడిచేయని అడుగేస్తూ,
తడబడే గుండెల జడుపునుడిపే
తుపాకిని - అడపాదడపా తడుముకుంటూ
మెదిలాను వదిలంగా
ఈ నిశ్శబ్ద, నీరవ ప్రకృతిలో !! -
ఈ నిశీథినీ గాఢ సుషుప్త్యావస్థలో,
ఈ సుప్త వనాంతర సీమలో,
జాగరితుణ్ణి నేను! జాగరణ చేసేవాణ్ణి నేను !! -
ఈ నిష్కంప లతానికుంజాలలో,
ఈ నిర్వాత తరుశిఖరాగ్రాలలో,
ఈ నిశ్చల వన్యమృగ నిద్రావస్థలో,
కంపితుణ్ణి నేను! కల్పనా చతురుణ్ణి నేను!! -
ఈ క్రుద్ధ వ్యాఘ్రీ సంచార పథంలో,
ఈ విభీత హరిణీ నయనాంచలాలలో,

ఈ మదకరేణు కరిణీ పదఘట్టనలలో,
చలితుణ్ణి నేను! భావనా విచలితుణ్ణి నేను !! -
తెల్లని, చల్లని, వెన్నెలలు
మెల్లగా దివినుండి భువికి
అప్సరోనందోహంలా,
ఏకధారలా, జలపాతంలా
హేమంత శైత్య ఝురీ తరంగాలుగా
వర్షిస్తున్నాయి - ఈ నిశ్శబ్ద నిశీథినిలో !! -
వృష భేంద్రు శృంగంలా,
జడలు విరిసిన భూతంలా,
విజృంభించాయి వృక్షాగ్రాలు ! -
పెనవైచి, ఇసుమంత చొరలేని గుబురులై
ఇరుల దొంతరల వలె గుంపులై
బలిసాయి తరులతలు! -
దున్నపై జిలుకు జల్లులా,
వెన్నెలల వెల్లువలు ముసురులై
తరుకన్య కబరీ భరమ్ములో
చిక్కు కొని జారాయి మెల్లగా బిందులై,
ఇల మీద నిలిచాయి తెలివన్నె చిందులై ! -
తిమిరాలు ఒదిగాయి
తరుమూల ధరణిన్మై !
వెన్నెలలు గదిసాయి
తరుబాహ్య వసనమై!!
అజ్ఞాన తిమిరాలు - గుబురులై, గుమ్ములై
శాఖోపశాఖలై, దట్టముగ క్రమ్ముకొని,
హృదినుండి వెలిదార్చె - జ్ఞాన జ్యోత్స్నల నెల్ల!
దోబూచు లాటలై, వెన్నెలలు, చీకట్లు
విరిసె నానిశియెల్ల!! -
వెన్నెల వెల్లువల్లో తడిసి, తడిసి,

రాలిన వర్ష బిందువుల్లా.
చూరుకొస జాలిపడిన, చిన్ని చిన్ని నీటి పడియల్లా
వెలిసాయి వెలుగుల జిలుగులు!
వనకన్య తిమిరాల జరీయంచు చీర కుచ్చిళ్ళలో,
పాదపమూల ప్రాంగణంలో,
గుబురు చీకట్ల పొదలలో
పొంచేసిన, బెబ్బులి మేనిపై - విభిన్న వర్ణాలు -
చారలై, పరచిన మేలి రత్నకంబళాలై,
వెన్నెల వెలుగుల్లో జిగేల్ మని,
మసక, మసక చీకట్లో ఫెడేల్ మని,
ఎదహత్తుకొన్నాయి, మదివిచ్చుకొన్నాయి!
నిగూఢనిధి నిక్షేప, విక్షేపాలై !! -
మోరలెత్తి, ముక్కుపుటాల
దూరాన వాసన పసిగట్టి, గాలివాటాన
సవ్వడికై చెవులు నిక్కించి, రిక్కించి,
వ్యాఘ్రగమన శబ్దానికై - నిరీక్షించి,
పరుగుపందేలలో పోటీగా, మునిగాళ్ళ పైనిలిచి -
లంఘించే భంగిమలో
చలిత నేత్రాలతో,
ఆ బెరుకు కళ్ళల్లో ప్రతిఫలించే
భయాందోళనలతో, కంపించే తనూలతలతో, -
నిలిచాయి దూరాన లేళ్ళ కదుపులు ! -
సిత జ్యోత్స్నాలతా రోచులు
నవదంతాగ్ర మనోజ్ఞ రుచులై,
చటులాంధ కారధారలు
తనూవినీల మదదాన ధారలై,
ఆషాఢ కాలనీలమేఘాలు
రూపు గొన్న కరిణీ కరేణు సమూహాలై,
పదఘట్టనలతో, మదఘీంకృతులతో

నడయాడే నీలాద్రులై, కదలాడే మహోదధులై,
గుంపులు, గుంపులై, మందమందగమనాలు సొంపులై,
నిర్భీకులై - కదిలాయి మద మత్తేభాలు !
గాలికి గలగలారావాలి, కాలి దారులంతా
దట్టంగా, పట్టుపరుపులా - క్రమ్మిన పత్రాలపై,
సితాసిత రేఖా పరివ్యక్త రోచులై,
కొండచిలువ - తనూసితా సిత కాంతిలా, -
మందమల యానిల వీచి కాడోలల్లో కదలాడి,
కవోష్ణ పవన తరంగ మాలికల్లో మెదలాడి,
జల్లున జాలే జెత్తి పోతులా -
ప్రభావిహీనమైన, కుబుసంవిడిచి,
నిబిడీకృత కోపాకృతులు, చలత్కాంతిరేఖావక్రగతులు -
నిరంతరం పోయే, గోధుమ వన్నె మేలిత్రాచులా -
వెలిగాయి జ్యోత్స్నారసధునీ వినిర్గత కాంతి కిరణాలు,
వినీల వన్య పథాంతః కరణంలో! -
గంగా వినీల తరంగాలు - గగనాలనుండి
శివజటాజూట చంద్రరేఖా కాంతి తరంగాల
కలిసి, మెలసి, సితాసిత కాంతి పుంజాల నీనినట్లు,
వెన్నెలలూ, తెలివెలుగులూ, చీకట్లూ, క్రీనీడలూ
తిమిరాలు, మహాంధకారాలు, భయాలు, భీకరస్వరాలు
కలగా పులగంగా, ముప్పేటగా -
స్నిగ్ధమనోహరంగా
ముగ్ధ మనోజ్ఞంగా
ప్రతిఫలిస్తున్నాయి -
ఈ విపిన హృదయసౌహార్దంలో !
ఈ మహారణ్యమధ్యంలో !!

# మహారణ్య మధ్యంలో - (II)

చూపులకు బెబ్బులైనా
ఆకలి గొంటేనేగాని - తాకదు హరిణాన్ని!
టోపీలు గాంధీవైనా
అజీర్తితో త్రేపులు ఆవులించినా -
భుజిస్తారు ప్రీతితో మన నాయకులు పరధనాన్ని!
మృగయావ్యసనంతో, మృగభావంతో
తనసంతానాన్ని - తానే పొట్ట బెట్టు కుంటుందంటారు వ్యాఘ్రి! -
నిజమెంతోమతి! -
రగిలేపగలుగా, మృగసమానులుగా
మతవిద్వేషాలతో, కులవర్గరోషాలతో
తనసోదరీ, సోదరులనే - మట్టు పెట్టి
రట్టు చేస్తున్నాడు సంఘవిద్రోహిగా మానవుడు!
నిజంకాదా? ఇది మతి? -
జవసత్త్వాలుడిగినప్పుడు,
భీకర రావాలు గొంతులోనే అణగినప్పుడు.
బెబ్బులి - వ్రణార్తితో, క్షుధార్తితో
ముదుసలియై, వనపథగ్రస్తయై
జనపథ సమీపస్థయై - పొంచుంటుంది -
మానిసితిండికై, సునాయాసభుక్తికై! -
జవసత్త్వాలు సుష్టుగా, పదవీ వ్యామోహాలు పుష్టిగా,
అధికార రవాలు వృష్టిగా, సమిష్టిగా,
ఉంచిన పదవులు ఊడేలోగా,
వంచిన పరదానాలు చెయిజారేలోగా,

దీపమారేలోగా ఇల్లు చక్కదిద్దుకొనే
రాజకీయ మేధా నిష్ణాతులై,
సాంఘిక సేవాపథ తృష్ణార్తులై,
నీతి పథభ్రష్టులై, దురాశాపథగాములై
ప్రజాస్వామ్యజనపథంలో, జనారణ్యమధ్యంలో
పొంచున్నారు - సంఛన్న వ్యాఘ్రాలు -
మానిసి తిండికై, సునాయాసభుక్తికై !! -
ఘీంకరించినా, హుంకరించినా, అహంకరించినా -
విజృంభించిన వృక్షాగ్రాలనీ.
అవరోధాలైన తరులతాగుల్మాలనీ,
పురోగమనానికెదురైన అరివీర వర్గాన్నీ
తొండంతో పెకలించి, దంతంతో విదిలించి.
కాలితో కదిలించి, ముందుకు సాగుతుంది -
ఠీవిగా మదమత్తేభం! -
మహాకాయమైనా, కేవలం శాకాహారంతో,
మరంద తుందిలాలైన సెలయేటి జలాలతో,
మనోహరవాసనా భరితార విందాలతో,
సమిష్టి సంక్షేమమే - సమ్యగ్దృష్టిగా,
కలసికట్టుగా, మూకుమ్మడిగా
ముందుకుదూకి సాగిపోతుంది -
మత్తకరేణు, కరిణీ, సముదాయం,
మంద మంద గమనాలతో
ఈ మహారణ్య మధ్యంలో !
సాంఘికన్యాయం ఘీంకరించినా,
ప్రజాస్వామ్యం హుంకరించినా,
దళిత శక్తులు అహంకరించినా,
పక్షబలంతో, పార్టీ మద్దతుతో, అధికార మదంతో
చట్టాలను చుట్టాలుగా చేసి,
శాసనాలను సుఖాసనాలుగా చేసి,

'రూల్స్'ను 'పుట్ రూల్స్' గా చేసి,
ప్రజార్జితం స్వార్జితంగా,
అధికార హోదాలు నిరవధికంగా,
స్వార్థం విహారార్థంగా,
అల్పాహారులమని, అనల్పాహారులై,
కుహనా హసనాల గోముఖ వ్యాఘ్రాలై
వ్యర్థోపన్యాసాల శల్యసారథులై,
శుష్కప్రియాలతో, శూన్య హస్తాలతో, కలసికట్టుగా, మూకుమ్మడిగా,
గొఱ్ఱెల మందగా ముందుకుసాగి పోతున్నారు! -
నిరాతంకంగా, నిర్విరామంగా,
అధికారమత్త, ధనాంధదాన జలస్రవత్
కరిణీ, కరేణు సముదాయం !
ఈ అమాయక జన హృదయ విపినాంతర గుహాంతరాలలో,
ఈ ప్రజాస్వామ్య నామక మహారణ్య మధ్యంలో !! -
యుగయుగాలుగా, తరతరాలుగా వంశపారంపర్యంగా
దారిద్ర్యకబంధ బంధంలో, అజ్ఞాన తిమిరసమూహంలో,
అవమాన తీవ్ర పవమానంలో
కన్నీళ్ళ తో దాహాన్ని, రోదనతో క్షుధార్తినీ,
ఆవేదనతో అన్యాయాన్ని
ఎముకల గూడు లాంటి దేహాన్ని,
శూన్యాకాశంలాంటి హృదయాన్ని,
శ్మశానం లాంటి పరిసరాల్ని -
భరింపలేక, భరింపనన డానికి వీల్లేక ,హరించుకుపోయిన మానధనాలతో -
పొంచుండి కాటేసే విషభుజంగాలకు,
నక్కినక్కి నమిలేసే నక్క వినయాలకు !
నిశ్శబ్దంగా, సంఛన్నంగా, పొంచి, పొంచి
హింసించే వ్యాఘ్రాలకు, -
భీతావహులై, చేతనా వివశులై, జీవచ్ఛవాలై,
కర్తవ్యవి మూఢులై, జీవకళా విహీనులై దీనమానసులై,

భయసంచలిత నేత్రాలతో,
అస్థి పంజరంలా - కదలాడే శుష్క శరీరాలతో !
హోసమింకి, తడారి, వణికే పెదవులతో,
అగోచరభవిష్యాంతర ఊహా నిరీహులై,
బాధాభుజంగ క్రోధ పూత్కార హతులై,
శూన్యావకాశజలధీ తరంగ తాడితులై,
నిలిచారు వెలిగా -
దూరాన పొలిమేరల్లో, గజగజవణకుతూ,
భీత, హరిణీ, హరిణ సమూహాలు !
చిరపీడన, భయాందోళనలతో
దళిత ప్రజానీకాలు ,
ఈ నవజీవన మానవసమాజంలో,
ఈ ప్రజాస్వామ్య
మహారణ్య మధ్యంలో !! -

# మహారణ్య మధ్యంలో - (III)

చిక్కుకొన్నాను - ఈ మహారణ్యమధ్యంలో !
నిలద్రొక్కుకోలేక పోతున్నాను -
నలుదిక్కులా క్రమ్మే ఈ కాఱు చీకట్ల దండయాత్రలో !
అవినీతిలా, నిట్టనిటారుగా మిన్నంటిన - దారువృక్షాలు
ఆశ్రిత పక్షపాతంలా గుబురుగా మన్నంటిన - వట వృక్షాలు !
అసమర్ధతలా  అంతటా అల్లుకున్న లతావితానాలు !
ఎటుచూచినా - వివేచనాలోచనాలతో
విశ్వాన్ని తిలకించే - సహస్రాక్షుడి ఒక్కగానొక్క
తొలితెలి ఆశాకిరణమైనా దూరలేనంత
క్రిక్కిరిసిన, దట్టమైన పత్రాలతో,
ఆతపత్రంలా అడ్డుపడిన కీకారణ్యంలో -
కాకులు దూరని కారడవిలో, చీమలు దూరని చిట్టడవిలో -
ఇరుక్కున్నాను దారీ తెన్నూ తెలియని నిరాశ్రయుడినై !
విలవిల లాడిపోతున్నాను - ఈ నిర్జీవ, నిర్జన, మహారణ్య మధ్యంలో !! -
ఎటుచూచినా - స్వార్థపరాయణ ప్రతినిధులైన వృకోదరులు!
సమాజసంక్షేమకుంజ  విధ్వంసకభల్లూకాలు !
అన్యాక్రాంత పరాయణులైన - సింహంగులు !
నమ్మించి, తడిగుడ్డతో గొంతుకోసే - భీకరమకరాలు !
అందితే  జుట్టు, అందకుంటే కాళ్ళను కొనే - గుంటనక్కలు ! -
ఈ క్రూర వన్యమృగాల ఘోరారావమధ్యంలో -
చెవులు గింగుర్లెత్తి, గుండెలు దడదడలాడి, హడిలి పోతున్నాను -
ఈ నిర్జీవ నిర్జన మహారణ్య మధ్యంలో !! -
అంతటా  కన్ను పొడుచుకున్నా  కానరాని చీకటి!
అంతటా విచ్చలవిడిగా తిరిగే అడవి పందుల గుంపులు!

అంతటా పదవీమదోన్మత్తమత్తే భాల ఘీంకారాలు!
అంతటా పరమ పదసోపానారోహణలో కృతకృత్యులైన విషభుజంగాలు!
అంతటా పొంచుండి, ఎరకై, కాటేసే గోముఖ వ్యాఘ్రాలు!
అంతటా అధికార వ్యామోహ దాహంలో విఱ్ఱవీగే సింహకిశోరాలు!
ఎటూ తప్పించుకోడానికి వీల్లేక -
ఎటూ జీవించడానికి అవకాశం లేక -
ప్రాణాలు గుప్పిట్లో బెట్టుకొని
విల విలలాడి పోతున్నాను ఒంటరిగా -
ఈ నిర్జీవ, నిర్జన
మహారణ్య మధ్యంలో !
ఈకృష్ణ పక్షగాఢాంధ
నిశీథినీ హృదయంలో!! -

# నిరీహ

ఆశా, నిరాశల - మధ్య
మనస్సు - ఊగిస లాడినప్పుడు,
మమకారం, నిర్మమత్వాల - మధ్య
మది - ఇరకాటంలో పడ్డప్పుడు,
వాంఛా, వైరాగ్యాల - మధ్య
హృదయం - సందిగ్ధావస్థలో పడ్డప్పుడు,
వెలుగు, నీడల - మధ్య
కనులలో - మసక, మసక చీకట్లు క్రమ్మినప్పుడు,
ఆస్తిక, నాస్తిక భావాల - మధ్య
నమ్మిక - కడుపు కక్కుర్తి పడ్డప్పుడు,
ఊహా, వాస్తవాల - మధ్య
మస్తిష్కంలో - అనుమాన కల్లోలం రేగినప్పుడు,
'నా' అన్న అస్తిత్వం,
'నే' నన్న అహంభావం -
హృదంతరాంతర
గుహా గర్భాలలో,
ఆకలిగొన్న, కొదమ సింగంలా
గర్జించినప్పుడు, -
సందేహ నివృత్తికై,
అనుమాన ప్రవృత్తికై,
భావనా సుధాసాగర
మథనంలో,
ఊహాతీత పరబ్రహ్మతత్వాన్ని
అమృత భాండంలా
వెలికి తీద్దామని,
అంతర్ముఖుణ్ణి అయ్యాను !
కానీ, -

నాలోని, సురా, సుర ప్రవృత్తులు
విజృంభించి, -
నాలోని, రాగద్వేషాలు,
మద మాత్సర్యాలు,
కామ క్రోధాలు,
పెల్లుబుకి,
వాసుకి విషపూత్కారంలా
ఉవ్వెత్తుగా పొంగి,
హృదంతర విషయ
వాంఛా సాగరాలు,
భావనా తీవ్ర
బడబాగ్నిలో ఘూర్ణిల్లి,
నా మనో సుధాపయోథిలో
ఉద్భవించింది!
అమృతమా? - కాదు! కాదు ! !
హాలా హాలం!! -
అది అరచేత ముద్దగా చేసి
వెన్నముద్దలా
దిగమ్రింగడానికి
నేను
భవుణ్ణీకాను !
పరమ శివుణ్ణీ,
నీలకంఠుణ్ణీ!
గరళ కంఠుణ్ణీ! -
అంతకన్నా కాను !! -
నేనో - సామాన్యుణ్ణి !
నేనో - మానవుణ్ణి !
ఈ ఆలోచనా తీవ్ర
విప్లవాగ్ని
ఈ భావనాంతర నిత్య
దావాగ్ని,

లోలోపల,
అంతరాంతరాలలో,
హాలాహల మహాగ్నిలా,
నన్ను - నిలువునా
దహించివేస్తుంది !
ఈ బుద్ధి వైపరీత్యం,
త్రినేత్రాగ్నిలా,
నన్ను భస్మీభూతం చేస్తుంది!
ఈ మనోవికారం,
అణుధూమ మహాంబరంలా,
నన్ను నలువైపులా క్రమ్మేస్తుంది!
భావనాతరంగ
ప్రసారా వధుల్ని, మించి,
మేఘో విద్యుత్తరంగ కాంతి
ప్రసార విశాల పరిధుల్ని మించి,
విహరించే,
విభ్రమించే,
ఈ మనో, బుద్ధ్యహంకార,
శాఖా చంక్రమణం -
ఒక దురూహ !
ఊహా విహంగ,
మనోవిహార,
భావనా గగన పరిధుల్ని దాటి
పయనించే,
అధిరోహించే,
ఈ కవితా తపో ధ్యేయ
గౌరీ శృంగ శిఖరా రోహణం,
కేవలం
ఒక నిరీహ !! -

# వాసంత హేల

ముద్దగా విరిసింది! ముద్దుగా తురిమింది!
ప్రొద్దెక్కని తొలిసంజలో మోదుగ ముద్దరాలు!
తలనిండా విరులు! వెలలేని ఎఱ్ఱని సిరులు !! -
కింశుక వృక్షాగ్రాలు - తీక్ష్ణాంశుని కిరణ ప్రతి బింబాలు!
కింశుక తరుశాఖలు - శీతాంశుని క్రోధాపాంగ మరీచులు!
కనుచూపుమేర - నిరామయం!
కనుగొలకుల - కన్నీటి మయం!
ఎటుచూసినా - ఊళ్ళూ, అప్పలూ!
ఎటు పరికించినా - బోసిగా పాదపాలూ!
ఈ శూన్యంలో, ఈ జడ ప్రకృతిలో
ఎఱ్ఱగా మందహాసం చేసింది!
వెఱ్ఱిగా తలెగుర వేసింది!
అపాద మస్తకం - నగ్నంగా,
ఆ పాదమస్తకం - పత్రశూన్యంగా,
మోదుగ విరబూసింది - అరుణారుణ కుసుమాలతో!
మోదుగ నవలాస్యం చేసింది - తరుణారుణ కింజల్కంతో!
మోదుగ సితహాస్యం చేసింది - రక్తారుణ పల్లవాలతో!
ఏమిటీ అరుణారుణ హాసం?
ఏమిటీ తరుణాట్ట హాసం?? -
తరతరాల దాస్యంలో, నరనరాల ఇంకిన బానిసత్వంలో -
అట్టుడికిన భారతీయుని అసహనం,
మట్టుమణిగిన సామాన్యుని ఆక్రందనం,
పట్టుదప్పిన మేధావి భావనా తీవ్ర సంచలనం -
పెల్లుబికి విరిసిందది - ఎఱ్ఱని 'లావా' గా!
పెల్లువలై ఉరికిందది - ఎఱ్ఱని నెత్రుటేర్లుగా!! -
వాక్కువిప్పలేని జీవన శిలా రూపాలై,
హక్కులెఱుగ లేని పశు పక్షుల ప్రతిరూపాలై,

నిరంతర దారిద్ర్య దవానలంలో మ్రగ్గే
బిక్క మొగాలలో విరిసిన - కన్నీటి తుంపురులా?
స్తబ్ధత మూర్తీభవించిన, జడ ప్రకృతిలో,
నిశ్శబ్దత ఆవరించిన ప్రశాంత వాతావరణంలో,
బాధా తీవ్రహవిస్సులో, వేదనా భారబడబాగ్నిలో,
ప్రేగి, ప్రేగి, జ్వలించిన,
వీతిహోత్ర శిఖిశిఖారోచిస్సులా? -
జాతి, గాత్ర కదన కుతూహల రీతులా?? -
'ఎమర్జన్సీ' - లిలాక్షయిందని
సముజ్జ్వల క్రోధావేశంతో
కారాగార గుహాంతరాలనుండి
జీరవోయిన సింహగర్జనలతో
హరివిల్లులా - వెలికురికిన ప్రజానాయకుల
పలుకుల ఇంద్ర జాలంలో,
మిలుమిట్లు గొల్పిన - సురుచిర రాజకీయ చైతన్యంలా -
విరబూసింది కింశుక తరువు!
మరపురాని ఈ వసంతారామంలో! -
అట్టడుగున ఉన్న నిరుపేద ఆశాకిరణ రేఖలా,
చిట్టచివరి అంతస్తువాని రోషోగ్ర నయనాంచల రోచిలా,
మానవ మేధః కుసుమ వికాసారుణ హాసంలా,
దానవ మనోభావ సంహరణ ప్రహసనంలా
తొలిప్రొద్దు నీరెండలో తళతళలాడింది!
తొలివెలుగు రేకల్లో కలకలలాడింది!
ఎఱుపు! - రూపు కట్టినతనువు,
మఱపురాని మోదుగ పూతనువు!
ముద్దగా విరిసింది! ముద్దుగా తురిమింది!
ఆ తొలిప్రొద్దున మోదుగ ముద్దరాలు!
తలనిండా విరులు! వెలలేని ఎఱ్ఱని సిరులు!! -
ముద్దగా విరిసినా, ముద్దుగా ఎఱుపు చివళ్ళు మెఱిసినా -
వాసనకు - నోచుకోలేదు!
వనితాప్రణయ సమాశ్వాసనకూ నోచుకోలేదు!

దేవతా పూజా గౌరవానికీ -నోచుకోలేదు!
ప్రముఖ రాజకీయ నాయక గళసీమలో
మాలగానైనా అలంకరించడానికీ - నోచుకోలేదు ! పాపం!
సాహితీ ప్రియభావుకతకూ, కవితా వస్తుప్రామాణ్యతకూ -
అసలే నోచుకోలేదు!
అయ్యో! పాపం! -
ఎందుకూ పనికిరాని దన్నారు మోదుగు పూవుని!
అయ్యో పాపం! -
ఎందుకూ కొఱగానిదన్నారు మోదుగ పూబాలని!! -
కానీ,
అదే, ఆ అమాయక కింశుకతరువు -
ఈ వాసంత వేళలో
మదన మనోజ్ఞహేలగా విరిసింది!
పెల్లుబికి, ముందుకురికే
ప్రజాస్వామ్య మందహాసంలా విరిసింది!
అంతరంగంలో ఎన్నాళ్ళో దాగిన
ఆక్రందనా రూపంలా వెల్లివిరిసింది!
చింతనా మయ ప్రపంచంలో
బాధా క్రోధోగ్ర రూపంలా విరిసింది!
సర్వసామాన్యుని మర్మమెఱుగని సన్నని సణుగుడులా విరిసింది!
మాయామర్మమెఱుగని,
ముగ్ధబాలికామధుర దరహాసంలా విరిసింది! -
ఈ మితిలేని ఎఱుపుకు,
ఈ యతిలేని విఱుపుకు -
అందరూ - ఎగబడ్డారు!
విరబూసిన అరుణారుణ సౌందర్య ప్రపంచం -
ఈ ముద్ద మోదుగ పూలనేరుకొందామని,
అందరూ - ఎగబడ్డారు!
అరవిచ్చిన అరుణాధరమధుర సౌందర్యం -
ఆ ముద్దుల ఎఱ్ఱపూరేకుల బాలనందుకొందామని -
అందరూ - దిగబడ్డారు!

ఏ - 'ఎమర్జన్సీలూ' - అడ్డురాలేదు - పాపం!
ఏ - రసజ్ఞతా - ప్రతిబంధకం కాలేదు -పాపం!
ఏ - నాగరికతా - ఎదురొడ్డి రాలేదు - పాపం!
పిచ్చిగా నవ్వింది - మోదుగ!
వెచ్చగా నవ్వింది - మోదుగ !
ఎందుకూ - పనికిరానిదాన్ని - నన్నందరూ
ఈనాడు ఆరాధిస్తున్నారు!
ఏ వాసనా, రుచీ, పచీలేనిదాన్ని - నన్నందరూ
ఈనాడు శిరోభూషణంగా అలంకరిస్తున్నారు!
ఎందుకో? - ఈ తాపత్రయం?
ఎందుకో? - ఈ కుహనా ప్రేమాయణం? -
మాపటితో - తనకు కాలదోషం తీరిపోతుంది!
రేపటితో - తనువు చాలించి, రాలిపోతుంది తను!
అయినా - తన ఈ అల్ప ప్రాణంపై
వీరందరికీ - ఎందుకింత మమకారం?
తన - ఈ స్వల్ప వల్లవాలపై వీరందరికీ
ఎందుకీ మొసలి కన్నీరు?
శుష్కవాగ్దానాలతో మస్తిష్కాలు బద్దలు చేసే
రాజకీయ కళాధురంధరతనా ఇది? -
కాదు! -
తాను - సామాన్యుని ఆలోచనా తీవ్రతకు ప్రతిబింబం!
తాను- మేధావి మనోవాహినిలో పెల్లుబికే
బడబాగ్ని ప్రతిరూపం!
దాన్నే - ఓటుగా మార్చుకొందామని,
చాటుగా వెలచేసుకొందామని,
అందరూ - ఎగబ్రాకుతున్నారు!
అందరూ - దిగజారుతున్నారు!
అందుకే -
తాను - ఈ అందరికీ -
అందని ఊహా కుసుమంలా ఉండిపోయింది!

ఆశాజీవి నయనోజ్జ్వలతారగా నిలిచిపోయింది!
కవితా కుసుమారుణ కింజల్కంగా మెరిసి పోయింది!
సౌరభాతీతమైన కాంతికుసుమరేఖగా
ఎల్లవెలుగులు నింపి మురిసి పోయింది! -
తడారిన గొంతుకకు
దప్పితీర్చే భాగీరథీ తరంగ శీకరంగా,
నకనకలాడే పొట్టకు
పట్టెడన్నం పెట్టే అన్నపూర్ణ కరుణాదృగంతరోచిగా,
ఎముకల గూడైన తనువు కింత
వలువగప్పే వస్త్రదాత మందహాసంగా,
దీనజనుల కాశారోచిగా,
మేధావుల ఊహారుణ కుసుమవికాసహాసంగా,
మోదుగలు - ముద్దగావిరిసాయి! ముద్దుగా తురిమాయి!
ఎల్లని - ఆశాభావ మనోజ్ఞ ప్రసూనాలు !
ఎల్లని - తీవ్ర కోపోద్రిక్త నయనాలు !! -
అవినీతినీ, అన్యాయాన్నీ, అక్రమాలనీ, చూసి -
కన్నెఱ్ఱ జేసాయి - రోషాకషాయిత నేత్రాంచలాలు !
సమానత్వాన్నీ, భ్రాతృత్వాన్నీ, స్వాతంత్ర్యాన్నీ -
అందరికీ పంచివ్వటం లేదని - అలిగి
కన్నెఱ్ఱ జేసాయి -
అరుణారుణ కుసుమనయనాంచలాలు !! -
ప్రాద్దెక్కని తొలిసంజలో
సద్దులేక
ముద్దుగా విరిసింది - మోదుగ
ముద్దరాలు!
తలనిండా విరులు!
వెలలేని ఎల్లని సిరులు!! -

# శిశిరర్తు శోభ

శశికళా విరచిత,
శిశిరర్తు వేళాజనిత,
హిమ సంపాతంలో,
తలమునుకలైన, తొలిప్రొద్దుయిరుల
నీలవినీల రుచులు, పలుచబడేలా,
తెలివెలుగులు, కలబోసిన,
మషీరసం, ఖుషీగా
ఒలక బోస్తుంది,
సుదీర్ఘ తరుశిఖరాగ్రాలపై
ఉషోకన్య!! -
లజ్జాపిహిత, అవనతవదన
నూత్న వధూముగ్ధ - నీలికురులపై
తెలితలబ్రాలు, అలవోకగా,
దిగజారిన,
కళ్యాణ మధుర ఘడియలు
తళుక్కుమని మెరిసాయి,
స్మృతిపథంలో,
ఆ ప్రదోషశుభసమయాన ! -
కంఠదఘ్నమైన
చారిత్రాత్మక శోభతో,
పదచిహ్నాలను నిలుకడగా
నేలపై మోపలేని,
మందమంద, సుగంధ పవనాల
సంచలన ప్రణయంలో,
ఋతు వేళావికసిత

సౌహార్ద్ర సంగమంలో
అప్రయత్నంగా, అతిసహజంగా,
సాఫల్య మనోరథాలై,
పుష్పించి, ఫలించాయి,
ఆ శిశిరర్తు, తరులతాంగులు!
అక్రమ సంబంధాల
గర్భస్రావాలెఱుంగని,
ముద్దరాళ్ళు
ఆ వన సుందరులు!
గాఢాతిగాఢంగా
ప్రేమించిన ప్రియుణ్ణే,
వంచించే, చంచలత్వమెఱుగని
ముగ్ధాతిముగ్ధలు
ఆ వన దేవతలు!! -
వనితల కన్నా
వందరెట్లు నయం!
నిజాయితితో
ప్రకృతి సౌందర్యాన్ని,
తరుసంతతిని
పెంపొందించే
ఆదర్శ గృహిణులు,
ఆ వన వృక్షాలు!! -
పచ్చని చిగురాకులతో,
వెచ్చని పూపొదరిండ్లతో,
ముచ్చటైన బోదెలతో
నిత్య యౌవనం,
సత్యదరహాసం,
వెల్లివిరిసే
మచ్చలేని మానినులు,

స్వచ్ఛమైన త్యాగమూర్తులు,
ఆ వనకన్యలు !
మాధుర్యాన్ని
మకరందంతో జోడించి,
మాతృత్వాన్ని
బీజనిక్షిప్తంచేసి,
ప్రణయాన్ని
గువ్వలకువకువలలో నిల్పి,
ఆ - వనాంతర
హృదయసౌకుమార్యంలో,
అతిలోక
సుందరంగా
నిలిచింది
శిశిరర్తు శోభ!!! -

# చలి నా నెచ్చెలి

ఇది - ప్రణయగీతం కాదు!
ఇది - ప్రళయ సంగీతం అంతకన్నా కాదు!!
ఇది - సామాన్యుని స్వగతం!!! -
హేమంతం సామంతునిలా,
శిశిరం సర్వర్తుచక్రవర్తిలా,
ఋతురాజ్యం వెలిసింది! -
ఆకాశసౌధాల సీమంతంలో
సాకారహిమబిందు మౌక్తికోదంతం!
తరుశిఖరాగ్ర ధమ్మిల్లంలో
చిఱుగాలి వెలయించు శీత తరంగం!
ధూమ శకటం బరువైన నిట్టూర్పులో
అమ్లజనితో దోబూచులాడు హిమశకలం!
'డబుల్ డెక్కర్' 'ట్రబుల్డ్ స్టార్ట్' లో
గుబులు, గుబులుగా వెలికి రాలేని ధూమవిహంగం!
రాత్రంతా 'బార్'లో విరిసిన వెచ్చని నిషాలో
పాత్రాపాత్ర విచక్షణలేని దాతృత్వం!
ఇది - హేమంతశిశిర సంబంధి!
ఇది - వాసంత నిరీక్షణానుబంధి!! -
పొగమంచు - యుగయుగాల ఛాందస చిహ్నంగా,
చలిగాలి, కుల, మత తత్త్వ ప్రచార ప్రభంజనంగా,
హిమశైత్యలహరి, సమతా భావఘనీభవ దోహదంగా, హేమంత శిశిరాలు -
హిమశైత్యఝురులై ప్రవహిస్తాయని, స్తబ్ధతతో, జడతతో, ప్రకృతి భారంగా నడుస్తుందని,
ఋతుచక్రగమనం - ప్రగతి నిరోధకంగా స్తంభిస్తుందని, తలపోసాను!

కానీ, - చలి కెందామరలలో, నులివెచ్చని తేంట్లు
అంతర్లీనంగా నిద్రిస్తున్నాయని,

మంచులో మునిగిన బంతిపూరేకులు,
తొలిప్రొద్దున కించిదరుణ కిరణాల
పసిడి వెలుగుల్లో గిలిగింతలు పోయాయని,
అరవిచ్చిన కమలగర్భంలో
యువకావేశ పతాకంలా - భృంగ పక్షాలు
శృంగార మధుర మూర్తులై వెలికురికాయని
సమాజ హృదయ కుసుమాంతరంగంలో
అసమాన భావదావాగ్ని - అరుణారుణ కింజల్కమై
బరువుగా నిట్టూర్చిందని; -
ప్రొద్దెక్కినా కరగిపోని,
ముక్కరలా ముక్కుచివరనిల్చిన
ముద్దుల హిమబిందువు - హద్దుల చిహ్నంగా తలపోసి,
జక్కవ కవకోపంతో ఱెక్కవిదిల్చిందని,
చేతులు చలికి కొంకర్లు పోయినా
ఎదలోతుల - నెత్రుటేర్లు వెచ్చవెచ్చగా,
గలగలా ప్రవహిస్తున్నాయని,
బాహిరమైన జడప్రకృతి -
హిమశైత్య ప్రభావానికి ఘనీభవించినా,
హృదంతరాంతర విప్లవాకృతి -
అరుణారుణ జ్వాలాముఖిగా వరిణమిస్తుందని
చలినెగళ్ళలో - యువరక్తం
సలసలా మఱిగి పోతుందని,
పొగల మబ్బుల గుబుళ్ళలో
నవభావచైతన్యం రగిలిరగిలి
నిప్పై రాజు కుంటుందని,
భోగిమంటలో - రాగోద్వేగం
పరమోజ్జ్వలంగా ప్రజ్వరిల్లుతుందని,
మంచులను కరగించి, తమస్సులను విరజీల్చి,
మేధస్సులను రగిల్చి - యువతరాన్ని - చలిమంట

పురోగామిగా జ్వలింపజేస్తుందని, -
తెలుసుకొన్నాను !!
చలి, చీకటి కౌగిలింతలలో
నులివెచ్చని యువకావేశం
నా నరనరాల పెల్లుబికింది!
తొలివేకువ చలిమంటలలో ఎఱ్ఱనివెలుతురు -
నెత్తురు సెలయేరై - నా యెదలోతుల గంతులేసింది!
సమతా భావారుణ నవకిరణరోచిలో
గతనిశీథినీ బాధాగాధా తిమిరం - తెలతెల్లగ విరిసింది!
యౌవనోదయ భావపురోగమనంలో
హిమ శీతలోదయకాల రోచిర్నివహం
నులివెచ్చగ వెలిసింది!! -
చలి నా నెచ్చెలి!! -
ఆ ప్రియాపరిష్వంగ కవోష్ణానుభూతిలో-
క్రియాజనిత పురోగమన మానవ కల్యాణం
నాకనుభూతియైంది!
చలి - నాలో - వేడినే కాదు
వాడినీ రుచి చూపించింది!
చుట్టూరా, నిత్యమూ - నన్నలము కొన్న
అజ్ఞాన తిమిర సందోహాలను,
ప్రజ్ఞారహిత భావ తమస్సులను,
పట్టుదలతో, గట్టిగా ప్రయత్నించి
వదిలించుకొమ్మన్నది!
చలి - నా యువరక్తంలో సంచలనం రేపింది!
చలి - విజృంభించి
అంతర్ముఖంగా, చింతనా సుముఖంగా,
జిజ్ఞాసానల జ్వాలలను, విజ్ఞానాభిముఖంగా,
మరల్చి - మనోహోమ కుండంలో
ఋత్విక్కులా ప్రేల్చింది! -
చలి - లో పొరలలో, దాగిన నులివెచ్చన!

అంతరంగంలో గుడుసుళ్ళుపోయే యౌవనోద్రిక్తత!
పొగమంచు - వెండితెరలలో దాగిన నిప్పులసెగ!
గుండెలోతుల్లో పెల్లుబికే యువభావార్ద్రత!
చీకటి - కన్నీటి మంచుతుంపురులలో
పొంచి చూచిన తొలివేకువ!
మానసాకాశంలో తళుక్కుమన్న యువకాశయఫలసౌదామిని!
గతమన్న - శిశిరర్తు శీతలోపరివస్త్రంలో
దాగిన అనుభవ విజ్ఞానం -
పురోగమన పథవిన్యాసానికి కవోష్ణ దోహదం!
చరిత్ర తీపిన, పొగమంచులోదాగిన
కరుణాంతరంగం - నవయుగ వైతాళిక సంగీతం!
ప్రాచీన భావతిమిర లతాకుంజంలో దాగిన
గీతా సూనపరీమళం -
నవీన భావనాకుసుమ వికాససౌరభం!
యువ కావేశానికి ప్రతీక -
శీతలఝరీ హృదంతర కవోష్ణ ప్రవాహం!
ప్రతిభా నవ్యతకు ప్రతీక -
శిశిరానుయాయి - వాసంత మధుర దరహాసం !
సమతాభావ దర్శన కు ప్రతీక -
ఆమని కై వేచిన పికీగళ తొలితేనె పలుకు!
చైతన్యం - నాకవితా ఝరీతరంగ సంయమనం!
చలనం - నాహృదయార్ధ్ర భావసంకలనం !!
సంచలనం - నా జీవన వీణానిక్వాణం !!! -
అందుకే - వెచ్చను రగిలించే
చలి - నా నెచ్చెలి !
అందుకే - ముచ్చట గలిగించే
చలి - నా నెచ్చెలి !!

# పోస్ట్ మార్టమ్

హఠాత్తుగా
తటిల్లతలా
కారు కడ్డంగా దూసుకుపోయింది
ఆ పసిపిల్ల! -
'సారీ' ! - బ్రేక్ సడన్‌గా వేసినా
గీసుకుపోయింది
ఆకసుగందు! -
విగతప్రాణాలతో
పగిలిన రక్తనాళాలతో
పడుంది నెత్తురు మడుగుల్లో
ఆ లేత ప్రాణం
ఈ క్రాస్‌రోడ్స్‌లో !! -
కోపంతో కుంచె విదిల్చి
కాన్వాసుపై జల్లిన అరుణారుణ వర్ణంలా,
పుడమితల్లి కడుపుచుమ్మలుచుట్టి
చిందిన ఎఱ్ఱని కన్నీటి బొట్టులా,
మొదలు నరికిన కదళీతరువులా
పడుంది పదేళ్ళ ఆ అనాధ బాల
ఆ క్రాస్ రోడ్స్‌లో!!! -
ఆగింది
ఒకే ఒక్క నిమిషం -
సర్వ మానవ జీవన ప్రవాహం !
ఆగింది
ఒకే ఒక్క క్షణం
సర్వ చేతనా జనసామాన్యం !
ఆగింది

ఒకే ఒక్క లిప్త
సర్వలోకభావనా తరంగ పర్యాప్తి!
స్తంభించింది
క్షణకాలం
స్తంభాంతర విద్యుత్తరంగం!
ఆగింది
అర్ధాంతరంగా
'ట్రాఫిక్ లైట్ సెంటరు'లో
అరుణారుణ కాంతి తరంగం!
పలికింది
అసంధిగ్ధంగా
ట్రాఫిక్ విజిల్ 'గొంతులో
మంద్రమధ్యమస్థాయి వేదనారవం!
భరించింది
శూన్యాన్ని
క్షణకాలం
సర్వమానవ భావనాలోకం!
వరించింది
దైన్యాన్ని
క్షణకాలం
సకల ప్రాణి చింతనాలోకం!
అంతా నిశ్శబ్ధమయం!
అంతా విషాదగాధాలోచన మయం!!
ఒకే
ఒక్క నిమేషం!!! -
అంతే ! -
మళ్ళీ మొదలైంది
నిత్యజీవన సాగర తరంగ మథనం !
నిత్యమానవ యాంత్రికపథ సంగ్రామం!!
'సడన్'గా ఆపిన "బ్రేక్"లు

సడలి కదిలాయి కార్లన్నీ!
'పొల్యూషన్' లోనే 'రివల్యూషన్' సృష్టిస్తామని! -
ఆకాశమంత ఎత్తెగసి,
నిస్తంద్రతలో, నిరీక్షణలో, నిశ్చలత్వంలో
అలా - పైపైనే నిలిచిపోయిన
ఉత్తుంగ సాగర తరంగం -
ఒక్కసారి గుభేలున
కెరటాలు, కెరటాలుగా
నురుగులు, నురుగులుగా
వెల్లువలై విరుచుక పడ్డట్లు
ఆకారంగొన్న
ఉత్తుంగ భావనా తరంగం
నిశ్శేష్టతతో, దిగ్భ్రాంతితో, నిరీహతో
అలానే - ఆలోచనా శిఖరాలపై
నిలిచి, నిలిచి
ఒక్కసారి చిద్రువలై, శీకరాలై
విరిసి పర్విడినట్లు, -
ఒక్క ఊపుతో కదిలింది
'స్టిల్ ఫొటోగ్రఫీ ' - 'థ్రిల్ సినిమాటోగ్రఫీ' లా,
తెరతొలగింది!
మందమందంగా స్తబ్ధత్వాన్నుండి
తేరుకొన్న జనసందోహం, కదిలింది!
నిట్టూర్పుతో మెదిలింది
మూగగా, బాధగా,
ఆలోచనా స్పందనం!
మళ్ళీ మొదలైంది
యాంత్రిక చతుష్పథ
నిరంతర సంగ్రామరావం!! -
'హారన్' మ్రోగించి
'క్యాడిలక్' లో వినిపించే 'పాప్మ్యూజిక్' కి

తలాడిస్తూ, నిట్టూర్చి,
"పూర్ బెగ్గర్ గర్ల్!'
అని సాగాడొక మాడ్! -
'గేర్ లివర్స్' చేసి
'ఫియట్'లో హుటాహుటి
'రేస్‌కోర్స్' కెళ్ళే 'హెవీ వెయిట్' గారు -
'డామిట్! కథ అడ్డం తిరిగింది' -
అని కదిలాడు 'యాంగ్రీ మూడ్'లో ! -
'ఇగ్నిషన్ కీ' త్రిప్పి
'అంబాసడర్'లో అంబాసుతసమేతంగా
'మారేజ్' కెళ్ళే 'బిజినెస్' మాగ్నేట్'
'వాట్ ఎన్యూసెన్స్ దిస్ అర్చిన్?'
అని అన్నాడొక 'ఇరిటేటింగ్ మూడ్'లో !-
'బ్రేక్'పైన కాలు తీసి,
'స్కూటర్'లో హబ్బీగారి లేతచనుగుబ్బలు
వెనుక వీపుకు వెచ్చగా తగుల్తుంటే -
'ఓ! దిసీజ్ భారత్'!
అని పెదవి విరిచాడు
'హాటైన 'మాట్నీ' షో కెళ్ళే
'హిప్పీ' బాబు తొందరలో!
'టాక్సీ'లో ఆదరాబాదరాగా
'రిట్జ్'లో 'కాక్‌టైల్ పార్టీ' కెళ్ళే
'అప్‌కమింగ్ సేల్స్‌మెన్'
'వాట్ ఎ క్రిమినల్ వేస్ట్ ఆఫ్ టైమ్
దిస్ డర్టీ ట్రాఫిక్ జామ్?' -
అని గట్టిగా చీదరించుకొన్నాడా నడిరోడ్డులో!
గోల్ కొండ కోటనుండి నాలికెళ్ళ బెట్టి
డొక్కు 'సైకిల్' త్రొక్కుతున్న
ముసలి గడ్డం చప్రాసీ
'క్యాజమానా హో గయా!'

అని, నిట్టూర్చి కదిలాడు, బీడీ పొగ
'పేవ్‌మెంట్' మీదికి వదుల్తూ! -
'కాలేజీ' ఎగ్గొట్టి, ఖులాసాగా
'క్రాస్‌రోడ్స్'లో దోస్తులపై భుజాలేసి,
'ఖుషీ'గా 'సిగరెట్' పీలుస్తూ -
కళ్లతోనే వనితా తనూవిలాసాల్ని
జుర్రుకొందామనే వెర్రికుర్రాడు
తన నాజూకైన ముఖాన్ని, తాజాగా
ప్రక్కకు తిప్పకున్నాడు జుగుప్సా భావంతో! -
తెల్లపైజమా, మల్లెపూవులాంటి సిల్కులాల్చీతో
కారాకిళ్లీ నముల్తూ, 'చార్మినార్ బ్రాండ్' పొగ వదుల్తూ
రాజకీయాలు వల్లించే, 'మాజీ పొలిటీషియన్'
'నిక్కృష్టపుచావులు సక్కృత్తుగా ఉండే
సమసమాజమే మనధ్యేయం!' - అని
పిడికిలి బిగించాడు ఆవేశంతో! -
సంఘంలో కుళ్లును క్షణమైనా భరింపలేని
'రివల్యూషనిస్టు' కళ్లలో నిప్పరవ్వలు చిందిస్తూ,
మనసులో చెలరేగే మంటల్ని మాటల్తో రేపుతూ,
'ఒలికించిన ఈ నెత్తుటు జ్వలియించును విప్లవాత్మ!' - అని
పళ్ళు పటపటా కొరికాడు కసితో!-
పొద్దుగాలనుంచి, 'చా' నీళ్లైనా పిలాయించలేని,
ప్రొద్దువ్రాలిన రిక్షావాలా-
'ఈ కడుపాకలి మంటలకన్నా, ఆ కారుక్రిందపడి
చచ్చిపోనాది మేలేగంద!" - అని
సుడుగుళ్ళు పడిపోయాడు దుఃఖావేశంతో!-
'ఫుట్‌పాత్' పై జడలువిరబోసుకొని
అవులిస్తున్న పిచ్చిసన్నాసి
'మాయా జన్మమురా! ఇది, మట్టిలోనే
మటుమాయమై పోయేనురా! ఓనరుడా!" - అని

తంబురామీటి, బొంగురు గొంతుతో
వాపోయాడు దైన్యంగా! -
అంతలో -
దూరాన, తన కనులనే తాను
నమ్మలేని భావనాతీరాన,
వేదనా సాగరఝంఝమారుతాన,
మాతృహృదయ కల్లోలఝరీ సంఘర్షణాన,
నిత్యదారిద్ర్య శోకాంబుధీ తీరాన,
దారీ, తెన్నూ తెలియక
కొట్టుమిట్టాడే భిక్షుకి -
కరిగింది వెల్లువై కన్నీటి కాల్వతో,
పొరలింది శోకరేణువై భూమాత ఉరములో,
సురిగింది నేలపై పుత్రికాశోక తరంగాలలో !-
అయినా - ఎవరూ, ఏమీ, పట్టనట్లుగానే
కదిలారు, మెదిలారు, తిన్నగా జారుకున్నారు!
రహదారులసవ్వడు లేమో
మామూలుగా, యధాతథంగా సర్దుకున్నాయి!
కారుహారన్‌లు, సైకిల్ బెల్స్, రిక్షా ఘంటలు,
'ట్రాఫిక్ విజిల్స్, ' పాదచారుల కేకలు,
వీధి పశువుల 'అంబా'రవాలు,
ఈ మహానగర ప్రయాణాంతర
విచిత్ర కోలాహల ధ్వనులు -
అన్నీ, అంతా - యథా స్థితిని పుంజుకున్నాయి !!
'డిటో'! 'షరా మామూలే!' - అన్నట్లు
జనసందోహం, శకట చక్రసంచలనం
అసలేమీ జరగనట్లు,
కదిలింది, మెదిలింది!
నగర నిస్సంబంధ జీవన బాంధవ్యం -
సినర్లైనా తొణక్క,

పసందుగా ముందు కురికింది యాంత్రికంగా! -
ఒంటిగా, నిరామయంగా,
కంటికీ, మంటికీ ఏకంగా,
మింటికీ, కంటికీ లోకంగా - కన్నీరు కారుస్తూ -
జంటలేని ఈ ఒంటి ప్రపంచంలో
ఎందుకలా నిలిచి పోయావు?
కవీ! ఈ క్రాస్ రోడ్స్‌లో? -
కరుణార్ద్ర హృదయంతో,
అరుదైన ప్రేక్షక  సహృదయంతో,
ఎందుకలా స్థాణువులా నిలిచి
కుందిపోయావు? ఈ ట్రాఫిక్ జామ్‌లో?! -
మానవత్వం మర్చిపోలేక,
దానవత్వాన్ని నిరసించే దమ్ములేక,
హృదయసింధువులో  శోకబడబానలాన్ని
మ్రింగలేని ఫాలాక్షునిలా నిలిచి
ఎందుకలా కుందేవు? ఈ జనమహారణ్యమధ్యంలో?! -
కుంచెడి ఆ మాతృశోకావృత హృదయంలో
చిందింపగలవా అమృతం! - నీ వేడి కన్నీటితో? -
అందింపగలవా? - పుత్రికాపునర్జీవనం! -
నీవాడి కవితాపీయూష వర్షధారలతో !!
ఎందుకు బ్రదర్ !
నీకీ
'పోస్ట్ మార్టమ్'?!! -

# అణు పరీక్ష

మస్తిష్కం బ్రద్దలవుతోంది!
అస్తిత్వం కనుమరుగౌతూంది!
ఉవ్వెత్తుగా సాగిపోతున్నాయి
అణుపాటవ ప్రయోగాలు.
భావనా భూగర్భంలో !
ఉద్ధృతంగా పయనిస్తున్నాయి
ఆలోచనా తరంగాలు
రోదసీ యాత్రికుల్లా
ఊహాంతరిక్షంలో!
ఉజ్జ్వలంగా సంచలిస్తున్నాయి - గతంలోకి,
కనుచూపు కందని చరిత్రాంతరంగంలోకి,
మానవ జీవన పరిణామ వికాస
జిజ్ఞాసా సాగర గర్భంలోకి,
గభీరవాహినీ గర్భాంతర
రత్నాన్వేషణ నిపుణుల్లా -
ఊహా ధూమాంబరాల స్మృతిపథ   గగనంలో!
వర్తమానపు టూహల వలుగులతో
భవిష్యద్భావనా తీవ్ర శతఘ్నీ ఘీంకారాలతో
భూత సమాలోచనా విద్యుత్కాంతిపుంజాలతో
కాలగర్భాన్ని ఛేదిస్తున్నాను!
మూలసత్యాన్ని అన్వేషిస్తున్నాను!
మనసులోతుల సొరంగాలలో గునపాలుగ్రుచ్చాను!
ఎదలోతుల శిలాగర్భంలో డైనమైట్లు బ్రద్దలు చేసాను!
'కన్వేయర్ బెల్ట్'లతో హృదంతరాంతర
తిమిర గర్భంలో దాగిన జ్ఞానఖనిజాలని వెలికితీసాను!

బొగ్గులను కొన్నవి, నిగ్గుదేరిన మాణిక్యాలై,
ఊయి అప్పలుగా కనిపించిన హేయమైన ముడిలోహాలు
హేమాంతర జాజ్జ్వల్య రోచులై
అట్టడుగున పడిఉన్న చట్రపురాళ్ళు చంద్ర కాంతశిలా వితర్ధికలై.
నాహృదంతర భూగర్భ పరిశోధన
సౌహృదాంభోధియై
నిరంతర నవ్యభావనా తరంగాచ్ఛరోచిస్సులై - వెలసింది!
ఓంకారం నుండి
ఉపనిషద్వాక్య పరమార్థం వరకు.
వేదాల నుండి
నాదబ్రహ్మోపాసనా విధానంవరకు, -
సీతారామ ప్రణయ గాధలనుండి
గీతాప్రవచన మధుర పీయూషం వరకు, -
వ్యాస, వాల్మీకి మహర్షుల నుండి
కాళిదాస, భవభూతి, భట్ట, బాణుల వరకు, -
పరాశర, మను, మహాస్మృతులనుండి
విదుర, కౌటిల్య, యౌగంధ రాయణుల వరకు, -
తర్క, వ్యాకరణ, జ్యోతిషాల నుండి
గణిత, విజ్ఞాన శాస్త్ర, కళారంగాల వరకు,
ప్లేటో, మార్క్స్, ఏంజిల్స్ నుండి మాల్థూస్, కీన్స్, మహల్నోబిస్ వరకు,
హరప్పా, మొహంజొదారో, అజంతాల నుండి,
పికాసో, రవివర్మ, అమృతాషెర్‌గిల్‌ల వరకు,
కావ్య ప్రబంధ, పురాణ విజ్ఞానం నుండి
నవ్యకవితా స్వేచ్ఛా విహారం వరకు,
మేధో విహంగోర్ధ్వపథంలో,
జిజ్ఞాసాణు విచ్ఛేదనా మహోహవరంగంలో.
వివేకాణు విశ్లథన మహాకార్యరంగంలో
చిమ్మింది అణుధూమం!
క్రమ్మింది నభోంతరాళం!

గుమ్మటాలు, గుమ్మటాలుగా,
శ్రావణ నవ నీలాంబుదాలుగా,
శరత్కాలసితరోచి: ప్రభాపుంజాలుగా,
గగనాలు వ్యాపించాయి, ఖగేంద్ర విపుల పక్షాలై!
ఆకాశాన్ని ఆవరించాయి సాకార జ్ఞాన ధూమతరంగాలై!
విశ్వాన్ని - ఆ అణు ధూళినింపింది!
నశ్వరంగా కనిపించాయి - అన్నీ -
అపరమాణువిచ్ఛేదనా మహాతీవ్ర సంక్షోభంలో!
అంతర్దృష్టి - నా ఏటమిక్ రియాక్టర్!
సమ్యగ్దృష్టి - నాన్యూక్లియర్ ఎక్స్ప్లోషన్!
భావనా తీవ్రత - నా హెవీ వాటర్ సప్లై!
ఊహాగంభీరత - నా రేడియేషన్ స్పెషల్ ఎఫెక్ట్!
బుద్ధి పరమాణువును బ్రద్దలు కొట్టాను!
ఊహాణుమూలస్వరూపాన్ని తుత్తునియలు చేసాను!
సుఖదు:ఖాలు, జనన మరణాలు, యౌవన వార్ధక్యాలు
రాగవైరాగ్యాలు, శబ్ద, నిశ్శబ్దాలు, ఆశానిరాశలు
అజ్ఞానవివేకాలు -
అన్నీ - ఆమహాప్రళయ ధూమవిస్ఫులింగాగ్నిలో
విలీనమై పోయాయి!
ఆ అనూహ్య ధూమాంబర విచిత్ర సమాకర్షణలో
భస్మీభూతమైనాయి!
కుదిలించాను ఎదలోతుల్లో
పదిలమైన నిధినిక్షేపాలని,
విదిలించాను
భావనా సాగర గర్భంలో, 'ఆక్టోపస్' కబంధహస్తాలలో
మిణుకు మిణుకు మనే, రత్నరాసులని,
అంతర్ముఖుణ్ణి , చింతాపరాఙ్ముఖుణ్ణై,
కాలాతీతమైన, భావనా జ్వాలా తీవ్రమైన,

ఆలోచనా పరమాణువునై
నాలో నేను వితర్కించాను!
లోలోన సుడిగాలి! నాలోన బడబాగ్ని!!
కాలాలు, యుగాలు, కల్పాలు,
నీలగగనాలు, సాగరాలు, మహీధరాలు,
ఇలాతలాలు, స్వర్లోకాలు, పాతాళాలు,
తమస్సులు, రోచిస్సులు, మసకచీకట్లు, -
తీవ్రభావనా కేంద్రీకృతమై,
ఊహాపరమాణు విచ్ఛేదనాసంభృతమై,
ధవళమనోవియత్తలాన్ని,
వినీల ఊహా జ్ఞానసాగరాన్ని,
హరితమేధావసుధాతలాన్ని -
భావా తీత జ్యోతిర్మయంగా,
ఊహాతీత 'పరాబ్రహ్మం'గా,
అనిర్వచనీయ తేజోభావంగా,
ఆవరించింది
ఆధ్యాత్మికా భావపరమార్థం!
'అహంబ్రహ్మాస్మి' యై!
వెల్లివిరిసింది -
సచ్చిదానంద
బ్రహ్మవిరాట్ స్వరూపం! -
'సృష్టి, స్థితి, లయ' - కారిణియై!

# జీవన కధనం

ఈ జీవన కధనం -
బాధాగాధా నిధానం!
ఈ జీవన మధురిమ -
ఆనంద ఝురీ నిమజ్జనం!! -
శిశిరంలో - ఆకులు రాలి, వినీలగగన ఫలకంపై
ప్రకృతిగీసిన - విషాద రేఖాచిత్రంలా -
నిలిచాయి మ్రోడైన తరుశాఖలు!
వసంతంలో - ననలెత్తి, గుబురులై కుసుమించి
తైలవర్ణచిత్రంలా, ఇంద్రధనుస్సులా, మోదాబ్ధి తరంగరేఖలా -
వెలిసాయి - నవ వృక్షాగ్రాలు!
శిశిరంలో - పండుటాకులు, వడలి, బడలి
నేలవ్రాలాయని -పరితాపం!
వసంతంలో - మ్రోడైన తరువులు, మెండుగా
నింగివైపుగా తొంగిచూస్తూ
చిగిర్చాయని - సంతోషం!
గూటిలో - వెచ్చని పికీతనూ పరిష్వంగ సౌఖ్యం
వదిలిందని - అనుతాపం !
తోటలో - మాకంద కిసలయమాధుర్యాలను మెసవి,
కుహూ కుహూరావాలతో, పంచమస్వనాలను
వినిపించాననే - ఆనందం!
శైత్యశిశిరర్తు తనూగాఢానురక్తి
తఱిగిందని - విలాపం!
నిత్యవసంత మనోప్రసవ సౌరభానురాగం
పెఱిగిందని - సల్లాపం!
ఫాల్గున మాసగత, శీతలస్నాన, భుక్త్యాను పాన
నైవేద్యసుఖం తుదియైందని - నిర్వేదం!
చైత్ర మాస, రతీమన్మధ పూజానుష్ఠాన

సౌభాగ్యం, సౌలభ్యం మొదలైందని - సమ్మోదం!
వేసవిలో - ఎండలకు, వడగాడ్పులకు,
తనువు లలసి, సుడుగుళ్ళు పోయాయని - చింత!
గ్రీష్మంలో - బొండుమల్లెలకు, నిండుసన్నజాజులకు
మనసు భ్రమసి, వలపు తిరుగుళ్ళు పోయిందని - గిలిగింత!
దప్పికకు, గ్రీష్మాతపానికి,
నాల్కతడారి, పిడచగట్టిందని - వంత!
పానకాలతో, శీతల పానీయాలతో -
స్వేదతనూ తాపం, హృదయాంతరపరితాపం -
తీరిందని -కేరింత!
మండుటెండలకు, చెండే సుడిగాలులకు -
వగళ్ళే చింతలనెగళ్ళుగా మారాయని - ఆవేదన!
మల్లెపూచెండ్లకు, మగువ బిగికౌగిళ్ళకు,
రాత్రిళ్ళు - ప్రణయరమ్యశీతలంగా -
వెలిసాయని - నివేదన !
విద్యార్థులకు, విరహిణీజనులకు -
విషమ పరీక్షాసమయమేతెంచిందని - బిడుపు!
సుదీర్ఘ విరామాలకు, హిమశీతల, హరితరమ్యస్థల విహారాలకు -
సకుటుంబ యాత్రాప్రతీక్షాకాలం దగ్గరైందని - ఆటవిడుపు !-
తెలిమబ్బులకు, తొలిచిన్కులకు,
మెఱుపుజిగికన్నెలకు, తఱపితెలివెన్నెలలకు,
కనుచూపుమేరలో మృగతృష్ణలైనాయని - వగపు!
తెలిమల్లెల వెల్లువకు, తొలివలపులజల్లులకు -
కులసతీ, సితమందహాసాలకు, తెలివలువల పాలకడలి తీరాలకు -
కనువిందుగా ప్రణయజలధి పొంగిపొర్లిందని - మురువు!
తొలినాటి ఆషాఢ మేఘాల సలిలాంతరంగంలో
వెలసిన, చీకటుల గుంపుకై - వెఱపు!
తొలిచిన్కు, పుడమితల్లి దాహాన్ని - నిలువెల్లగా తడిపి
తీర్చే - మెఱుపుకన్నెకై - మురుపు!
జడివానలో ముద్దయై, పడిసెంతో, చలిజ్వరాలతో
ఒడలంతా వణకులై - వగపు!

ముగ్ధయై వర్షాన, పులకమ్ము సస్యాంకురమ్ముగా,
పుడమిలో మొలకలై - నగవు!
తెలిమల్లెలూ, పాలనురుగుల్లాంటి వలువలూ
తలపుల రంగంనుంచి నిష్క్రమించాయని - ఆరాటం!
పట్టుచీరెలూ, పసుపుపారాణులూ - మగువల
మనోసాగరతరంగాల తేలిపోయాయని - ఉబలాటం! -
జల్లుమని జారింది - పంకసంకలనమై
వనిత కోమల పాదద్వయం!
చిల్లుమని ఎగసింది - చండసదృశమై
మండూకోపనిషదధ్యయనం!
ఒడ్డులొరసి, గడ్డుసమస్యలా మీదికురికే కూలంకష -
పరచింది పల్లంలో ఎల్లని ఒండుమన్ను!
కిన్నెర సఖీపరివేష్ఠిత, గౌతమీసుధాస్రవంతి -
పలికింది భద్రాద్రి రామన్న చెన్ను !
వర్షాభ్రఘన సంభ్రమంతో,
జలధారాపాత విజృంభణంతో-
సాగింది వెల్లువై - వాగూ, వంక!
కర్షకమనోభ్ర ఘనగర్జనతో
సస్యసమ్మోదాశ్రు జలపాతంతో -
వెలిగింది వెల్లువై - ఏరువాక! -
వేగముడిగి, తెలియనుకతిన్నెల,
పాలి, సన్నబడినానని-
నదీకన్య - మనఃఖేదం!
నిర్మలాంతఃకరణయై, సస్యశ్యామలగర్భయై
మందగమన నైనానని -
పుడమికన్నె - ప్రమోదం!
మొగిళ్ళ, నలుపంచు తెలివల్వలు
విడిచానని, గగనాంగన - తొట్రుపాటు!
నిర్మేఘ, శరత్ జ్యోత్స్నా విభావరీ
పీతాంబరినని - మిన్ను కన్నె - మిడిసిపాటు!

ఉఱుముఱుముల, మెఱుపుతళ్కుల,
వెఱగంది, భ్రమజెంది, బిగికౌగిళ్ళ నొదుగు
నూత్నవధూప్రథమ ప్రణయ స్వప్నాలు - విరిసాయని , -
తెలివన్నెల, శార్వరీ మధురనిశాసమయాలలో,
తొలినాళ్ళ రహోమధురిమలు - తిరిగి కురిసాయని, -
జలబిందువులు వ్రాల్చు - తరులెల్ల
తలంబ్రాల ముచ్చటలు - తఱిగిపోయాయని, -
శరదిందు శీతల రేఖా ప్రసారంలో, తరులెల్ల విరబూచి
తెలినగవు - లొలికాయని -
వర్షాసమయాంతానికై వగచింది - ప్రకృతి!
శరదాగమన శుభసూచనకై పులకించింది - భూసతి'
శరదిందు వదన చంద్రికలు -
వెలతెలాపోయాయని - నిర్వేదం!
హేమంత జ్యోత్స్నా ప్రసారాలు -
కోమల కిసలయాలై పల్లవించాయని - సమ్మోదం!
లేతపచ్చనిచేలు, లేగదూడల త్రుళ్ళు -
వెనువెనుకబడ్డాయని - అలుక !
ముదురు కంకులపైరు, ముద్దబంతులతీరు
ముద్దుగా ఎదలలో మరులు గొల్పాయని - కులుకు!
దీపావళీ అమావాస్యదీప్తులే,
హృదయానురాగజ్యోతులే - విస్మబోయాయయని,
ధనుర్మాస ఉషఃకాల ఘృతదీపనివాళులే -
భక్తిప్రవత్తులై - చెన్ను మిగిలాయని,
బలాకలు, తెల్లుపూలు, మబ్బులూ
కరవైన, వెన్నెల రేలు - మందగించాయని,
పావురాలు, గోగుపూలు, కించిత్ శైత్యపవన
సంచలన నిశీథినులు - అందగించాయని -
శరదిందిరారమణికి - భారంగా వీడ్కోలు !
హేమంతవిలాససీమంతినికి - సరదాగా - ఎదుర్కోలు!
ముద్దబంతి పసిమి పూగుత్తులతో

ముద్దరాలి సొగసు, మిసమిసలాడే
పసిమిబుగ్గలతో దోబూచులాడే
పొగరు పిల్లగాలు అంతరించాయని - వగపు!
చిఱుమంచుముత్యాలబొట్లు, ప్రత్యూషకాలంలో
కందిచేను పసిడి తలలపై చిందీ, దిగజాఱీ
రతనాల తలంబ్రాలలా నిలిచాయని - నగవు!
మొక్కజొన్న కంకె పొత్తుల్లో, ముదరని లేత పాలగింజలను -
కసివాటుగా కొరికి, ఎగిరే, పికిలిపిట్టల
నకిలీ ఈలలు సన్నగిల్లాయని - సంతాపం!
బంగరువరిచేలు, మత్తుగామసలే నిండు చూలాలి
మృదుమధుర మందదరహాసాలను తలపించాయని - సల్లాపం!
చలినెగళ్ళు - బలిసి - నరనరాల ప్రసరించే
వేడినెత్తుటి సెలయేళ్ళలో, కవోష్ణభావ
వికాస ప్రసారాలు - చిందించాయని, -
చలివేకువ, తొలిజామున గొల్లపిల్ల
చల్లజిలుకుతూ వణికించిన, వినిపించిన
కూనిరాగాలు, - వేణుగానాలైనాయని -
మృదులాంగుళీచలిత, మధుర దధికలశంలో
నవనీత సుథలు, నవలాధర సుధామందహాసాలైనాయని, -
ఓణీలకొసలు, పట్టుపరికిణీల అంచులు నేలజీరాడే
ముద్దరాలు - ముంగిట కలయంపి జల్లి, ముగ్గులదీర్చి -
గొబ్బెమ్మల సవరించి, పరవశించి పాడిందని, -
మెడగంటలు ఘల్లుఘల్లుమని,
చిఱుమువ్వలు కిణకిణమని,
ఆబోతుల అడ్డులేని తిరుగుళ్ళు -
శిశిరపవనాల మెత్తనిమత్తులో - మందగించాయని,
ప్రాభాతశిశిర
మలయ శీతలపవనాలు -
ఆలయధ్వజాగ్ర ఘంటికానిక్వాణాల,
మృదుమధుర నాదస్వర లహరీ

తరంగ సంచలనాల,
ఓంకార నినాదాల,
శంఖనిస్వానాల,
పరమేశ్వర మంత్రపుష్పావసానకాల
ధ్వనిత ప్రణవనాదాల -
ముర్ముంరించి
భక్త్యాంజలి ఘటించి -
ఆనంద జలధీతరంగాలు
చెంగలించాయని
మహదానందం! -
సర్వర్తు భావనా సమైక్యమై,
వేదనా తీవ్ర భావసమున్ముక్తమై,
ఉద్వేల కవితాస్రవంతీ
చలత్తరంగ తేజోనిధానమై,
అపూర్వానంద సంధానమై
వెలసిన -
ఒక అనిర్వచనీయ
భావనా గీతం -
ఈ జీవన కథనం !
ఆనంద ఝరీ నిమజ్జనమీ
జీవన మధురిమ!
బాధాగాథా నిధానమీ
జీవన కథనం!! -

# ఓ మూసీ! నీవూ గోదావరై పో!!

నేనేం భగీరథుణ్ణిగాను!
గంగావతరణందాకా, నింగిలో శివజటాజూటాన్ని
చూస్తూ కూర్చోటానికి ! -
నేనేం కాళిదాసును అంతకన్నా కాను!
నిర్జల 'మేఘసందేశం' వింటూ కునికిపాట్లు పడటానికి!! -
నేనీ భాగ్యనగరంలోని ఇరవయ్యో శతాబ్దపు సగటు పౌరుణ్ణి !
నల్లాలలో మంచినీళ్ళకై, తెల్లార్లూ పడిగాపులు పడి -
మొహంవాచినవాణ్ణి ! అహం చావని వాణ్ణి!! -
అయినా - మూసీ ! నీకేం తక్కువైంది?
మెండైన గండిపేట - భద్రాచల మనుకో!-
రామాలయం లేకున్నా! -
మూలున్న ధూల్‌పేట - పురానాపూల్ బ్రిడ్జి -
ధవళేశ్వరం పాత ఆనకట్ట అనుకో ! - కూలిపోతున్నా!
సయానా నయాపూల్ వంతెన -
క్రొత్తగా కట్టిన గోదావరి బారేజ్ అనుకో ! క్రిక్కిరిసి పోతున్నా!
సొదరుగా చాదర్‌ఘాట్ బ్రిడ్జి -
విజ్ఞేశ్వరం పాతలాకులనుకో ! శిథిలమై పోతున్నా!
ఓ మూసీ ! ఉత్తుంగ తరంగాలతో
ఉవ్వెత్తుగా ఊగిపోతూ, తరలిరా! గౌతమిలా!
కెరలి, పొరలిరా! సప్తగోదావరిలా!
ఏ పదేళ్ళపై చిలుకో అయింది - నీ విశ్వరూప తాండవంచూసి, మూసీ!
మదించిన మా రాజకీయ వినాయకులు - పదేపదేచేస్తున్న
వాగ్దానాల మేఘనాదాలకు జడిసిపోకు! హడలిపోకు!! -
కదంత్రొక్కుతూ, పదంపాడుతూ, పరవళ్ళుపోతూ
గలగలా పొంగిరా ! - మన తెలంగాణా

కోనసీమ కెందునా తీసిపోదని - బలంగానిరూపించు!
జలార్ణవం కల్పించు! కవితా మహోర్ణవం సృష్టించు!
రా! మూసీ!రా! కట్టలకట్టుబాట్లు త్రెంచుకొనిరా!
గట్టుల చెలియలికట్టలదాటి, పొంగి పొరలుతూ, రా! సాగరంలా!
గొంతు తడారి, పిడచలుకట్టిన మా నాలుకలకు,
అంతో, ఇంతో, దాహం పోయించు! ప్రాణం రక్షించు!! -
అనావృష్టితో, దుర్భిక్షంతో అలమటిస్తున్న మా రైతన్నకు
ఈ ఏడైనా ఇంత తిండిగింజపెట్టించు!
సామీరిలా, నీబలం నీవెఱుగవు! అందుకే ఈ స్తోత్రపాఠం!
నీజలప్రళయానికి మాకేం భయంలేదు! నీ అలల ఘలంఘలలకు -
మాకు చెవుడేమీరాదు! అది మాకు కర్ణామృతమే! రా! మూసీ! రా!
సప్త గోదావరిలా కదలిరా! లిప్తలో వెల్లువలై ప్రవహించేలా రా!!
ఇకనైనా - ఆశాజనకంగా ముందుకు కదలిపో!
ఓ మూసీ! నీవూ గోదావరై పో!! -

# జోడుగుళ్ళాల స్వారి

బాల్యంలో బమ్మెర పోతన్న,
యౌవనంలో కవిబ్రహ్మ తిక్కన్న
ప్రౌఢవయస్సులో కవిసమ్రాట్ విశ్వనాథ, మహాకవి శ్రీశ్రీ -
ప్రేరణలై, నాసాహిత్యాభిరుచికి దోహదం చేస్తే -
నా భావనా విహంగం నవనవోన్మేషశాలియై
రసాస్వాదనా మధురిమకై ఉరకలు వేసే తరుణంలో -
పరికిణీ వోణీలతో కన్నెపిల్లలా,
చెంగుచెంగున గెంతుతూ లేడి కూనలా,
భావనామధుర దరహాసాలతో
ఊహాప్రణయ పరీరంభంలో - నన్ను ముంచెత్తావు నీవు!
నాహృదయంలో సుస్థిర పీఠం వేసావు నీవు!
కవితా కన్యవై! నవతాప్రతినిధివై!! -
నాయువకావేశమహాసాగర తరంగాల మృదుమధురనాదానివై
నాగొంతులో ప్రణయ గీతాల కూపిరివై
సుడులు తిరిగావు నీవు! నా ఎడదలో కవితాలాస్యం చేసావు నీవు!
రసరమ్యనిర్ఘరివై! ధ్వనిమనోజ్ఞ కవితావాహినివై!! -
మన ప్రణయం -యౌవనోద్వేగాన్ని అధిగమించి -
ముదురు పాకాన పడి - నేను -
సాహిత్యరంగంలో అడుగుపెట్టేసరికి -
పోటీ ఎదురైందినీకు! - నా మధురోహల ఊర్వశికి !! -
శ్రీముగ్ధయై, పరిణీతమనోజ్ఞాంతరంగ పారిజాతమై
సప్తపదితో - శృంగార రసతరంగిణిలా ప్రవేశించింది
నా జీవితంలో ! - అసలైన, సిసలైన, పదహారేళ్ళ తెనుగింటి ఆడపడుచు!
నాప్రేయసిగా! కల్యాణ గుణగరీయసిగా! -
అయినా - నీ ప్రణయం - భావనా మనోహర ప్రపంచంలో -

ఆలోచనా రమ్యసాహితీ జగత్తులో,
రసతరంగిణీ వినూత్న విహారంలో,
ధ్వనిమనోజ్ఞ కావ్య శిల్పావిష్కారంలో -
పెనవేసుకొన్న, ముడివేసుకొన్న కవితా తీవ్ర ప్రవాహం!
మఱి ఆమె ప్రేమో? -
అతివాస్తవ జగత్తులో, నిత్యసంసారయాత్రా తాపత్రయంలో
జీవనాధార పదవీబాధ్యతలలో - ముప్పిరిగొన్న, పెనవేసుకొన్న
గృహిణీ ప్రణయ గాఢ మనస్తత్వ విజృంభణం!
ఎందుకో మనస్పర్ధలు పొంగిపొరలిరా లేదు మీలో?
ఎందుకో సపత్నీ సహజమాత్సర్యం విరిసివెల్లువ కాలేదు మీలో?
సహజీవనం సాగించారు! సహవాసం పొడిగించారు!! -
ఇద్దరూ ! - అదే నా అదృష్టం !! -
ఎవరి పరిధుల్లో వాళ్ళు పరిభ్రమిస్తున్నారు -
సమానాంతర వృత్తపరిధుల్లా!
సమానాంతర వృత్తాల కేంద్రంగా నిలిచిన నన్నిరువురూ
ప్రభావితం చేస్తున్నారు! రసప్లావితం చేస్తున్నారు!! -
ఇద్దరూ - సంతానాన్ని ప్రసాదించారు!
కొంత వెలుగునూ, కొంత చీకటినీ కలగలపి!
ఇద్దరూ - కష్టసుఖాలని పంచియిచ్చారు -
కన్నీరు, పన్నీరు జిలకరిస్తూ !
ఒకరితో - మధురాతిమధుర స్వాప్ని క, జగత్తులో,
మఱొకరితో - నిత్యనైమిత్తిక సంసార క్రియాకలాపంలో,
క్రీడించాను, రమించాను, పరవశించాను!
దుఃఖించాను, వేదనా మహోదధినైనాను!
కావ్యప్రపంచంలో - ధ్వనిరమ్య, నవరసానుభూతుల్ని గాఢంగా పొందాను!
భౌతికప్రపంచంలో - మధ్యతరగతి సుఖదుఃఖానుభవాల్ని చవిచూసాను!!
లౌకికంగా - భావనా గగనంలో ఎగిరాను.
సాహితీ వాహినిలో తన్మయమొందాను.

పారలౌకికంగా - కవితామందాకినిలో ఈదులాడాను.

ఆధ్యాత్మికమానస సరోవరంలో మున్కలేసాను.

అందుకే - ఈ ప్రొద్దుతిరిగిన వేళ,

ఈ మలిసంజ మసకచీకట్లలో,

ఈ వార్ధక సంధ్యా రాగారుణ ఛాయల్లో -

మీ ఇద్దఱే - నాకు మిగిలారు! - నీడల్లా, వెలుగు జాడల్లా! -

గతమధురస్మృతుల్ని నెమరువేసుకోవడానికి -

గత విషాదానుభూతుల్ని సింహావలోకనం చేసుకోవడానికి !

అయినా - కవితా తపస్సుకై,

సీతామనోవిషాద గాధా కధనానికై

ఆర్తితో, ఆవేదనతో, ఆర్ద్రతతో, -

జీవుని వేదనా విపంచీరవానికై,

పరుగులు తీస్తున్న, అలసి సొలసిన - ఈ ముసలి మనస్సుకు -

రసపరిపక్వత నొందిన, ధ్వనిమాధురీప్రధానమైన, ప్రతిభాసంపన్నమైన -

వృద్ధతపస్వినిలా, కవితాసతివై - నీవూ ! -

సంసారభావనాతాపత్రయంలో, విసిగి,వేసారిన,

ఈ ఆఖరి మజిలీ బాటసారికి - ఎడారిలో ఒయాసిస్సులా -

దాంపత్య పవిత్ర బంధంతో పెనవేసుకొన్న సహధర్మచారిణిగా - ఆమె !-

మీ రిద్దఱూ తోడునీడైతే, - మనం ముగ్గురం త్రివేణీ సంగమమైతే -

నామనస్సు - భవబంధ విముక్తవిహంగమై, రాగవిదూరమై,

ముక్తికాంతా మనోగగనంలో విహరిస్తుందా? -

నా తపస్సు - రసధ్వనీ వ్యంగ్య మధుర కావ్యాత్మయై,

ప్రతిభావ్యుత్పత్తులతో, భావావేశంతో,

భక్తి కవితా మనోనీరాజనం పడుతుందా?! -

ఏమౌతుందో మఱి? -

ఈ జోడుగుఱ్ఱాల స్వారి?!!! -

# వెన్నెల ! వెన్నెల !!

వెన్నెల - కవితా యమునా సికతా తలముల!
వెన్నెల - స్నిగ్ధమనోకుసుమాంతర సౌరభలహరుల!
వెన్నెల - ముగ్ధ వధూచలితాధర నవపల్లవముల!
వెన్నెల - రసికార్ద్ర హృదంతర భావస్రవంతుల!
వెన్నెల - చంద్రోదయవేళా ఘూర్ణిత జలధితరంగమ్ముల!
వెన్నెల - రాసక్రీడావిలసిత గోపాల దృగంతమ్ముల!
వెన్నెల - శరదాకాశపు తెన్నున జిలికెడి తెలిమబ్బుల!
వెన్నెల - కార్తిక పూర్ణిమ మిన్నున వెలిగెడి తొలిచుక్కల !
వెన్నెల - పిల్లన గ్రోవుల నూదెడి వెన్నుని వెన్నల పెదవుల!
వెన్నెల - చల్లల జిలికెడి విరహిణి గోపాంగన చిఱునవ్వుల!
వెన్నెల - గిరిగీసిన మధ్య కుటుంబీకుల బ్రతుకు కలల!
వెన్నెల -సిరిబొంగిన ధనికవర్గ సౌధోర్ధ్వ పథమ్ముల !
వెన్నెల - ఇరులెగసిన వగపుపూరిపాక నడికొప్పల !
వెన్నెల - పైకెగబ్రాకెడి నాయక దీర్ఘోపన్యాసమ్ముల!
వెన్నెల - జడులై, నిశ్చేతనులౌమేధావుల మస్తిష్కమ్ముల!
వెన్నెల - సృజనాత్మకమై, సామాజిక స్పృహవిరజిమ్మెడి విప్లవముల!
వెన్నెల - మూఢాంధ ప్రజా మనోగహనాంతర సీమల!
వెన్నెల - ఎదలోతుల వేదన ద్రవియించెడి సామాన్యుని కనుగొల్కుల !
వెన్నెల - ఆలోచన రేకెత్తెడి రచనాపథ భవితవ్యమ్ముల!
వెన్నెల - కవితా శివతాండవ భావోజ్జ్వల ఘలంఘలల!
వెన్నెల - కవితా పికీ కుహూనినాదమాధుర్య ప్రవాహమ్ముల!
వెన్నెల - కవితా శిల్ప రమ్య సుధాబ్ధి తరంగాల వెల్లువల!
వెన్నెల - కవితా తపఃఫలాప్త విజ్ఞానరోచిస్సుల!
వెన్నెల- ప్రాక్తన జన్మాంతర సంస్కార మనోజ్ఞహేలల!

వెన్నెల -వనితా  మృదులాధరశోభా ప్రసారమ్ముల!

వెన్నెల - కవితావనితా హృదయాంతర

వీణా మృదునాదమ్ముల !

వెన్నెల -   కవితా మురళీనిస్వన బృందావనముల !

వెన్నెల! వెన్నెల!!

కవితాయమునా సికతా తలముల!

వెన్నెల ! వెన్నెల!!

కవితా రమణీ కపోల రసవత్కాంతుల!! -

# క్రీనీడ

తొంగి చూచింది
క్రీ నీడ - ఊహాతరంగాలపై -
భావానికీ, వాస్తవానికీ మధ్య!
వంగి పరికించింది
ఛాయ - భావనాలహరిపై -
చలనానికీ, కార్యరూపానికీ మధ్య!
సందు చేసుకొంది
తొలినీడ - హృదంతరాబ్ధిలో -
ఊహాస్థితికీ, సృజనాత్మక శక్తికీ మధ్య!
క్రందుగా నిలిచింది
మలినీడ - ఆలోచనా స్రవంతిలో -
ఆవేశానికీ, స్పందనాకృతికీ మధ్య!
స్థిరంగా వెలిగింది
తెలినీడ - మనోకుహరంలో -
వాంఛా ప్రవృత్తికీ - ఆనందోపలబ్ధికీ మధ్య!
భారంగా వెలిసింది
కలినీడ - మానవ జీవన ప్రవాహంలో -
బలవత్తరమైన మూలశక్తికీ, జాతిమనుగడకీ మధ్య!
వడబోసిన
జీవితార్థానికీ -
దిగజారుతున్న పరమార్థానికీ -
మధ్య-
భావనా తరంగాలపై
తొంగి చూసింది
క్రీ నీడ !!! -

# ఎందుకయ్యా ! మాకీ ఉగాది?

ఎందుకయ్యా! మాకీ ఉగాది?
ఎందుకయ్యా! మాకీ ? రౌద్రి? -
గతంలో, భారతావనిలో -
సరిగ్గా అరవై ఏళ్ళ క్రితం
ఆ తొలి ఉగాదిలో
నీరాకను, నీపోకడను -
విప్లవ రసాల కిసలయాలను మెసవిన
స్వాతంత్ర్యోద్యమ భావపికీగళం
'కుహూ కుహూ' మధుర రావంతో -
వసంతాగమసూచకంగా
స్వరాజ్యశంఖారావ సంకేతంగా
తెల్లదొరల ఉల్లంలో
సింహగర్జనలా ఉఱిమిందేమో?
నేనెఱుగను!
వర్తమానంలో, ఈమలి ఉగాదిలో
తిమిర, క్షుధావర్త సంధ్యాసమయంలో
ప్రభుత్వ భట్రాజుల, పార్టీ బానిసల,
సమాజ వందిమాగధుల,
దాస్యమాకంద మకరందాలను రుచిమఱిగిన
శృంఖలాబద్ధ, అస్వతంత్ర భావ
పికీగళ, గద్గదారావంతో -
ఝంఝుమారుత కల్లోలసూచకంగా,
దౌర్జన్యోద్ధృత జలధీ తరంగ సంకేతంగా,
వినిపించిందేమో?

నీవు వస్తున్నావో? మఱి పోతున్నావో? -
నేనెఱుగను! -
నాడూ - నేడూ-
సగం కాల్చి పారేసిన బీడీనే
చెవిలో దురుక్కుంటున్నాను నేను!
నాడూ - నేడూ -
అర్ధాకలితో, వ్యర్థ కౌపీనంతో
అస్థిపంజరంలా మిగిలిపోయాను నేను!
కేవలం, ముతక పసుపు త్రాడుతో,
చినిగిన పాతచీరెతో, రవికలేని పయ్యెదతో,
కన్నీళ్లకు ప్రతినిధిగా,
మిగిలింది నా ఆడది!!
నకనకలాడే కడుపులతో
రూపుగట్టిన దారిద్ర్యంలా
నిరక్షరాస్యులై
మిగిలారు మా సంతానం!!! -
ఎండావానలకూ, చలిగాలులకూ
నిత్యాశ్రితంగా, రగిలిపోయే శ్మశాన వాటికలా
మిగిలింది మా పూరి పాక !!
నాడు - నవాబులకు, తెల్లదొరలకు,
వాళ్ల కుచ్చు కుళాయిలగులాములకు,
బాంచన్ని - నేను!
నేడు - షరాబులకు, నల్లదొరలకు
వాళ్ల తెల్లటోపీల గులాములకు,
బాంచన్ని - నేను!
ప్రకృతి - మాకన్నతల్లి!
వికృతి - మాపెంపుడుతల్లి!
ఎండంతా మాపాలు, వానలతోనే మా తలనీళ్ళు

చలంతా మామేని ఒణుకుళ్ళు
ఎదనిండా కడగళ్ళు! మానయనాల వేడికన్నీళ్ళు!
దైన్యం రూపొందిన రేఖాచిత్రాలం మేము!
మానవత మృగ్యమైన, ఈ మహారణ్య మధ్యంలో  లేడికూనలం మేము!
ఈ మా బ్రతుకు తెరువులో మార్పులేదు!
ఈ మా గతుకు బాటలలో తేర్పులేదు!
ఇది నిరాశా వాదం మాత్రం కాదు!
ఇది నిస్పృహాభావ సూత్రం అంతకన్నాకాదు!
ఇది వచ్చినిజం!
ఇది మా వెచ్చని నెత్తురు లిఖించిన
వేద భాష్యం!
ఇది మానవులుగా మేము భరింపలేని
నిరంతర వేదనా వజ్రాఘాతం!
ఆరుదశాబ్దాలుగడిచినా మారలేదు
మాప్రారబ్ధం! మాసంచిత పాపకర్మం!
ఎందుకయ్యా! మాకీ ఉగాది?
ఎందుకయ్యా! మాకీ రౌద్రి?!-
చేదూ, పులుపూ, తీపీ-
అన్నీ కలగా పులగం చేసిన
వింతరుచీ, వినూత్నానుభూతీ
ఉగాది వచ్చదంటారు మీరు?
తరతరాల దారిద్ర్యం విరబూసిన
వేపపూవు చేదు, - మాజీవితాలకు
గుమ్మడి పాదు!
యుగయుగాల దాస్యం వుక్కిలించిన
మామిడి ముక్కల పులుసు,
మా జిన్మ జిన్మలా మాసిపోని నలుపు!
శత, శతాబ్దాల ఋణగ్రస్త బాధాహృదయం

ద్రవించి కురిసిన, ఇక్షురసం తీపు -
మా ఎద లోతుల్లోని వగపుదీరని తీపు!-
ఎన్నికలొస్తాయయ్యా! రౌద్రీ!
నీకన్నా తొందర తొందరగా!
ప్రజాస్వామ్యం పన్నిన వలలో
ఇరుక్కున్న చేపలం మేము!
ఓటుహక్కుతో - పోటుగాళ్ళమని
మళీ, మరీ మురిసి పోతుంటాం మేము!
అది - ఓ మూన్నాళ్ళ ముచ్చటని
తెలిసి గూడా - మదిలో వెర్రివెంకన్నలా -
కేరింతలు గొట్టుంటాంమేము!
ఆ తర్వాత మన్నుదిన్న పాములా
తన్నినా పడుంటాం మేము!
విధి కెదురీదలేమన్న
అశక్త బాధాహృదయంతో!
అయినా - తెలియకడుగుతాను నేను
కుళ్ళిన సమాజంపై కళ్ళెర్రచేస్తే
అది రివల్యూషనా?
ముళ్ళిన వయసులో పళ్ళిగిలిస్తే
అది సొల్యూషనా?
'డర్టీ పాలిటిక్స్' అని సర్టిఫై' జేస్తే
అది 'ఎవల్యూషనా?
అన్నిటికీ 'లేబిల్స్' తగిలించటం
మీ కలవాటు!
అన్నిటికీ తలవంచి, ఆర్ద్రహృదయంతో
విలపించటం మా గ్రహపాటు!
అట్టడుగున వెట్టి చాకిరీ చేస్తూ
మట్టిలోనే పడుండుక -

ఇట్టా ఎదిరిస్తే, గట్టానిలదీస్తే -
ఏదో ఒక 'ఇజం'
మాకంట గడుతారు !
ఏదో ఒక "ఇస్టు"
మా జంట చేరుస్తారు!
బానిసతనం, బండ చాకిరీ, చిమ్మచీకటీ -
ఇవే - ఏ 'ఇజా'లు తెలియని
మా హృదయ నగ్నసత్యాలు!
అసమానత్వం, అన్యాయం, ఆక్రందనా -
ఇవే - ఏ "ఇస్టు" లూ తెలిసికోలేని
ఈ 'రెచెడ్ సిస్టం' లోని
మూల సిద్ధాంతాలు!
మేధావులూ, శాస్త్ర పరిశోధకులూ
కవిగాయకులూ, కళాకారులూ,
పరిపాలక బృందాలూ -
పాపం! -
మీరందరూ, మా గురించి
దీర్ఘంగా ఆలోచించేవారే?
కలంలో, మషీరసం,
నల్లగా, బలంగా, కాగితంపైన
రూపుదిద్దుకొన్న దాకానే
మీబాధ్యత!
గిలికిన నాలుగక్షరాలు,
గీసిన మూడు రేఖాచిత్రాలు
అలవోకగా అచ్చయి, ప్రదర్శింపబడి
ప్రతిఫలంగా వచ్చనోట్లు
చేతికందిన దాకానే మీ బాధ్యత!
తీసిన పదికూనిరాగాలు,
వేసిన ఏడు ఏకాంకికలు,

ఏ సినిమాలోనో, ఏ రేడియోలోనో
ప్రచార, ప్రసారాలు పూర్తి అయిందాకానే -
మీ బాధ్యత !
బుల్లిబ్రద్దలు చేసుకొని, వెల్లితలలు వేసేదాకా
యోజించిన ప్రణాళికలు, బడ్జెట్‌లోకి
తలదూర్చిందాకానే -
మీ బాధ్యత!
ఆపైన - ఆలోచించడమే మానేస్తారు!
ఆపైన - మనుగడలో సంచలనమే లేదనేస్తారు!
ఆపైన - అంతర్ముఖులై మిగిలిపోతారు!
అందుకే -
ఆకాశవాణి శబ్ద తరంగాలలో,
సినిమా స్లైడ్స్ దృశ్య కాంతివెల్లువల్లో,
వాల్‌పోస్టర్ల నయనానంద ప్రదర్శనల్లో,
మాత్రమే -
కుటుంబనియంత్రణ
ముమ్మరంగా సాగిపోతుంది ఈ దేశంలో!
అందుకే -
బూజు పట్టిన యోజనా మందిర
హృదంతరాలలో మాత్రమే -
అతిశీఘ్రగతిని పురోగమిస్తుంది ఈ దేశం!
అయినా -
ఎందుకొచ్చిన గొడవమీకు?
ముందూ, వెనుకా లేనివాళ్లం!
కామందులం ఎన్నటికీ కాలేనివాళ్లం!
సగమారిన బీడీని, పొగచూరిన కట్టెతో
వెలిగించుకొనేవాళ్లం!
మగత నిద్దురలో, పగటికలలు కనేవాళ్లం!

జగతి నిండిన తిమిరాన్ని
వగవు పొంగిన గుండెల్లో
అతి పదిలంగా దాచుకొని కుమిలే వాళ్ళం!
ప్రొద్దు పొడిచినా, ప్రొద్దుగూకినా
జర్గైనా ముద్దదిగని వాళ్ళం!
ఏ సద్దూ, సడీలేని, మొద్దు నిద్దరోతున్న వాళ్ళం!!
యాదకొస్తుంది -
ఆకాశవాణిలో, జాతీయకవిసమ్మేళనం
సావకాశంగా వినిపిస్తారేమో?
ఈ ఉగాది ప్రొద్దున!
ఏ అవకాశమూ లేని
ఈ జీవితాకాశవాణిలో
క్షుధార్తిజన కవితాసమ్మేళనమే
వినదలుస్తా - నీ మలిప్రొద్దున !
అయినా -
నిరంతరం -
మీ దొరలందరి కాల్మొక్కే
బాంచన్‌ని!
ఎందుకయ్యా? మాకీ ఉగాది!?
ఎందుకయ్యా? నాకీ కవితాసమాధి?!! -
(రంజని, 1980, రౌద్రి ఉగాది కవితల పోటీలో ప్రథమ బహుమతి)

# నీవూ - నేనూ

నీవు -
ఈ విశాల విశ్వంలోని
జడత్వానికీ, నిశ్శబ్దానికీ, నిష్కామకర్మకూ,
ఏకైక సార్వభౌముడవు!
నేను -
ఈ వివేచనా జగత్తులోని
చైతన్యానికీ, శబ్దమయప్రపంచానికీ, కర్తవ్యానికి
సామాన్య ప్రతినిధిని!
నీవు -
నిశ్చలత్వం, నిర్మమత్వం, నిర్గుణత్వం,
ముప్పిరిగొన్న త్రినేత్రుడివి!
నేను -
చంచలత్వం, మమతానుబంధం, గుణప్రాధాన్యం
పెనవేసి కొన్న మానవుణ్ణి!
నీవు -
జ్యోతిర్మండలంలో
పూర్వాభిముఖంగా పయనిస్తావు!
నేను -
వేదనాతమో వలయంలో
పశ్చిమాభిముఖంగా పరిభ్రమిస్తాను!
నీవూ - నేనూ -
ఉత్తర, దక్షిణ ధ్రువాలం!
నీకూ - నాకూ -
ఎప్పుడూ చుక్కెదురు!!

(రంజని - డిసెంబరు, 1982.)

# ఓ మహాకవీ! ఓ శ్రీశ్రీ !!

ఓ మహాకవీ !
శ్రీశ్రీ !!
ఓ శ్రీశ్రీ !!! -
ఛందస్సుల శృంఖలాలు త్రెంచి
ఛాందస భావాలకు స్వస్తిజెప్పి
శబ్దాశ్వహృదయం తెలిసిన మహాశ్వికుడిలా -
శబ్దంపై నిరంకుశాధికారం చెలాయించి,
సాధికారికంగా స్వాధీనం జేసుకొని
కవితాహృదయం వెల్లివిరిసే
శబ్దార్థ సమన్వయ గమనంతో
ప్రతిభావ్యుత్పత్తులతో
వల్గనప్లుతులతో, పదునైన కదనుత్రొక్కుతూ
విజృంభించావు ఆంధ్రసాహితీ పథంలో!
ఓ మహాకవీ!
నీ నాదం సామ్యవాదంగా
నీ గీతం విప్లవ సంగీతంగా
నీ కవితావేశం నవయువ కావేశంగా
ప్రళయ గర్జన చేసావు విప్లవ సింహంలా!
భీకరారావం విన్పించావు క్రుద్ధవ్యాఘ్రంలా!
దిక్కులు పిక్కటిల్లేలా ఘీంకరించావు
మదమత్తేభంలా!
నీ సింహగర్జనలకు ఛాందస కవిత్వం
ఏనుగు పిల్లలా వణికి పోయింది.
నీ వ్యాఘ్రారావానికి, ఆంధ్ర కవితా స్రవంతి
నిద్రమత్తు వదిలించేసుకొని, లేడిపిల్లలా

జనతా కవితా రామంలో
చెంగుచెంగునా గంతులేసింది!
నీ మదేభఘీంకారానికి
యువగళాలు సంకెళ్ళు త్రెంచుకొని నవయుగానికి నాందిగా
శంఖారావాలు పూరించాయి!
ఓ మహాకవీ! ఓ శ్రీశ్రీ !
మహాప్రస్థానం లోంచి, మరో ప్రస్థానంలోనికి
ఖడ్గసృష్టినుండి, ఖడ్గసృష్టిలాంటి
పదునైన వచన కవిత్వానికి, -
యాభైరెండు నుంచి, శోభాయమానమైన
స్వాతంత్ర్య వీరగీతాలకి,
సినీకవితా గేయాలకీ -
వచన కవితల మాగాణం నుంచి -
వ్యాసాలు, కథానికలు, రేడియో నాటికల
పంటతోటలవరకు -
అవిచ్ఛిన్నంగా, అనర్గళంగా, అనన్యంగా
అనితర సాధ్యంగా - సాగింది
నీ కవితా విప్లవ వ్యవసాయం !
వ్యాపించింది, - దేశదేశాలు, దిగ్దిగంతాలు
నీ కవితా విప్లవ శంఖారావం!
మ్రోగింది - తెలుగు నాట, వెలుగు బాటగా
ఎర్ర బావుటాగా - నీ విప్లవ కవితాభేరి!
సరసంగా 'అరసం'గా, తుదకు 'విరసం'గా -
విరబూచింది అరుణారుణ ప్రభలతో
ఈ తెలుగు నాట నీ తలపుతోట,
నిత్య విప్లవ భావ సంకేత కేతనంగా ! -
ఏదీ? - ఆ శంఖారావం నేడు?
ఏదీ?! - ఆ సింహగర్జన నేడు?

ఏదీ?! - ఆ విప్లవ మహోద్యమ
క్రుద్ధ వ్యాఘ్రా రావం నేడు?
లేదు! లేదు!! లేదు!!!
మూగబోయింది - భౌతికంగా ఆగొంతుక నిన్న!-
కానీ,
అదే తీగ సాగింది విప్లవ కవిత్వమై
ఆధిభౌతికంగా, అనంతంగా, నేడు !-
వెలుగుతోంది - ఆకలం బలం
నిత్యతేజస్సుగా, అరుణారుణ జ్వాలగా
తెలుగు నాట నేడు!! -
కవితాగగనపథంలో
మెఱుపు తీవలా,
ఉఱుము హోరులా,
ప్రళయ ప్రభంజనంలా,
యువకావేశంతో
నవతా సమతాపథంలో
తరతరాల విప్లవానికి
వారసురాలైన, తీవ్రవిపంచీరావంలా -
సాగిపోతుంది
ఆ కవితా తపస్సు !
ఓ మహాకవీ! ఓ శ్రీశ్రీ !
అదే - మాకు
ప్రొద్దు గ్రుంకని విప్లవోషస్సు !!! -

(శ్రీశ్రీకి విప్లవాశ్రుతర్పణం)

(రంజని 1983) 'స్మృత్యంజలి)

# జీవుని వేదన

శ్రీ చక్రమ్మును బూజసేయ, స్ఫటికశ్రీలింగమున్ క్షీరధా
రా చాంద్రీమృదురేఖలన్ దనుప, శ్రీ రాజేశ్వరీ స్తోత్రమా
లా చాతుర్యవచో విభూతులెదలో లగ్నమ్ముగా జేయ - శం
భో! చిద్రూపిని, నిన్నుగొల్తు కవితా పూజాఫలావాప్తితో! 1

జపములు సేయలేను, క్రతుసంగత దీక్ష వహింపలేను, ధ్యా
నపరత, యోగనిష్ఠల, ననంతుని భ్రూకుటి నిల్పలేను. నా
చపలతతో మనమ్మున రసాకృతిగా నినునెంచలేను. నా
తపము కవిత్వమై వెలుగ దాశరథీ! దయచూడు నీకథన్! 2

చమకమురాదు, నీలగళ! సంస్తుతిసేయ శివార్చనమ్మునన్,
నమకమురాదు లింగమ! సనాతన వేదవిధిన్ భజింపగన్,
డమరుక రమ్య నిస్వన విడంబములేదు, కపర్ది కీర్తనన్,
భ్రమ! కవితా తపమ్ము, రసరమ్య ధ్వనీకృత రామగాథలై! 3

నీవని, రామచంద్రుడని, నీలగళుండని, నీలమేఘపుం
భావము జానకీపతిగ, భావజవైరిగ, రావణారిగా,
నీవును, నల్లనయ్య, గరుణింతురొకే విధమైన రీతిలో,
జీవిత సత్యమిద్ది, రససిద్ధి నొసంగరె నాతపస్సులన్! 4

మెత్తని నాదుగుండియల, మీదులు కట్టిన భక్తిభావసం
పత్తిని, నీకథా కథన భావస్రవంతుల గిలుకొల్పి లో
కోత్తర కావ్య శిల్పమును గూర్చెదనంచు దలంతుగాని - నా
చిత్తమునిల్వబోదు! రససింధువులో కవితా తపస్సులన్ 5

వరదల సుళ్ళలోదిరిగి, వార్ధక పర్వత ప్రాంత భూములన్
గిరగిర గొట్టు కొంచు, పరిఖిన్న మనస్కత లీనమ్మైన, సా
గర ప్రియభూమినీహృదయగాఢ విషాదతరంగ మ్మైతి! నా
సరసను కావ్యకన్య రససంచలనాత్త ధ్వనిప్రవాహమ్మై! 6

ధనమదియేలరా? బ్రతుకుదారుల - నీ నయనాంత నీలమో
హనరుచి చాలదా? ఎదలు హత్తిన భక్తి మరందధార, లే
చిన, కవితా తపమ్ము విరజిమ్మిన నీ కథచాలదా? - మతే
మని, బ్రతుకీడ్తు? నీవయసు మళ్ళిన వేళ, విషాద సంధ్యలన్. 7

కట్టిన సంకెలల్ విడిచి, కాల భుజంగపు కోఱలూడ్చి ఇ
క్కట్టుల సంధి బంధముల ఘట్టన జేసి, విషాదఛాయ, లె
ష్షట్టున వ్రాలనీని, రసబంధుర కావ్యతపమ్ములోన, ని
గ్గట్టగ జూతురా! విషయబంధ విముక్త మనోజ్ఞజ్యోత్స్నగా! 8

(భారతి, జనవరి, 1988)

# తను వేణువు

ఈ తనువు
నీమృదుమధుర వేణువు!
ఈ మనసు
నీ నీలి క్రొంబెదవి సొగసు!
ఈ ప్రాణం
నీ మనోహర మురళీరవం!
పిల్లన గ్రోవిబెజ్జంలా
ఉల్లంలో, గళస్థానంలో -
మెల్లమెల్లగా, మంద్రమధ్యస్థాయిలో
ఊదుతావు నీవు!
స్తబ్ధమై పలకదు  ఈ గ్రోవి!
నిశ్శబ్దమై వినిపింపదు నీ మురళి!
ప్రాక్తన జన్మ పుణ్యపరీపాకం పండి
ఈ పంచేంద్రియాలలో ధ్వనించే ఆత్మనాదం -
నీ మురళీ మనోజ్ఞ నినాదం!
నీరవమైన, బాధానతమైన,
విషయ పరంపరాగతమైన,
ఈ శరీర వంశీనాళంలో -
శ్రీ రమణీ
రమణీయగానం,
ముక్తి మాధుర్య సంగీతం-
వి - ని - పి - స్తా - వా ?
ఈ తనువే
నీ వేణువైతే ?! -

(భారతి, డిసెంబరు, ౧౯౮౮)

# సుప్త శిల

కిల కిలా నవ్వింది
కలికి వెన్నెల తీవలా!
గలగలా పారింది
చెలియ, సెలయేరులా!
మిలమిలా మెరిసింది
మెలత శంపాలతలుగా!
అది శుభ్రజ్యోత్స్నా
పులకిత యామిని!
అది వినూత్న భావో ద్దీపిత
ప్రతిభా తరంగిణి!
అది భారతాంధ్ర వీథీ విహార
స్వతంత్ర భామిని!
తప్పటడుగులతో
శైశవం గడిచింది!
గొప్ప ఆశా లహరితో
యౌవన మధుర ప్రాంగణంలో అడుగిడింది!
అంతే -
ఉప్పెనలా కామసహస్రాక్ష వీక్షణం!
ముప్పిరిగా సంప్రదాయ తపోనియమ దీక్షణం!
మానినీ హృదయంలో సంఘర్షణ!
సంరక్షకుల నయనాల్లో ఆక్రమాన్వేషణ!
అది, - అధికార గౌతమశాపాగ్ని లో శలభం!
అది - అనధికార దేవేంద్రవాంఛాగ్ని కింధనం!!
అందుకే -
పాపం ! సుప్తశిల!
అహల్యారూప
ప్రజాస్వామ్యం!!! -

(భారతి, ఏప్రిల్, ١٩٨٢)

# రామ ధూర్జటీ!

లింగమ,వాది మూర్తివయి, లీల జగమ్ముల శిక్షసేయుచున్
గంగను నెత్తికెత్తికొని, కాముదహించు శివార్ధమూర్తి! రా
ముం గని యాత్మలోన తపముం బొనరించు, మునీశ్వరేశ్వరా!
చెంగట నీవు, నీహృదయసీమల, స్వామియు - రామధూర్జటీ! 1

చల్లని నవ్వువెన్నెలలు, సీత దృగంత మనోజ్ఞకాంతులై,
మెల్లని మందహాసములు మేలి పసిండి వెలుంగు లంబవై,
ఝల్లను జానకీహృదయ ఝుంకృతి రామమనోభిరామమై,
జెల్లెను పార్వతీప్రణయశీధువు నీకును - రామధూర్జటీ! 2

డమరుక నాదవైభవము డంబర మొప్ప, శివాసమేత నృ
త్యము రజతాద్రిపై సలుపు శాంభవ! రామ ధనుర్విముక్త బా
ణము - దశకంఠలుంఠన ప్రణాంతర వేదన లోని భావనృ
త్యము సలిపెన్ విషాద రణరంగమునందున - రామధూర్జటీ! 3

కొప్పున చంద్రవంక, ఉరగోజ్జ్వల హారము కంఠమాల, ము
న్నిప్పున గ్రాలి కందిన, వినీల గళమ్ము, విభూతిమేన - నీ
వొప్పితి భైక్షుకీ మధుర రూపము! రాఘవు డన్న పూరుషుల్
ముప్పిరి గొన్న మోహన సముజ్జ్వల తేజము - రామధూర్జటీ! 4

దోసిలిలోన పూలు, కనుదోయిని ప్రేమలతాంత కాంతులున్
బూసిన కొండకూతు నును బుల్కల బొంగు తపస్వివీవు! వి
ల్లూసిన వీరరాఘవ విలోకన రమ్య దృగంత కాంతి మ
ద్వాసిత ప్రేమమూఢ గను బాలుడతండటె ! - రామధూర్జటీ! 5

బూదిని మేనబుల్కుకొని, భూతియొసంగెడి జోగివీవు ! జ
వ్వాది, పునుంగు, కస్తురిల వాసనతో, విరిమల్లె మాలతో
శ్రీధరుడైన భక్తి రససింధువు, స్వామియతండు! భేదమే
లేదనుటెట్లు? మీదయిన లీల లచింత్యము! - రామధూర్జటీ! - 6

గంగనునెత్తి కెత్తి కొని, గౌరిని యర్థ శరీరజేసి, నీ
వంగనకున్ వశంవదుడవైతివి! - రాఘవు డంగనామణిన్
చెంగున నిప్పులన్ దుమికి శీలనిరూపణ జేయుమంచు - ని
స్సంగుడౌనయ్యె! భేదమిది స్వామికి, నీకును - రామధూర్జటీ! 7

త్రుళ్ళిన మన్మథున్ నయనరూక్షప్రసారమలించి, బూదిగా
ద్రెళ్ళగజేసి, పార్వతి వరించిన యోగివినీవు! గుండియల్
ఝల్లన శైవకార్ముక, విభగ్నముజేసిన, శత్రుగర్వభం
గోల్లసితుండు, రాఘవుడుగూడె ధరాత్మజ! - రామధూర్జటీ! 8

చెల్లె లపర్ణయై తపము జేసిన గాని లభింపనట్టినీ
యుల్లమెఱింగి, నీ ధనువు ఝల్లని వంచి, రఘూత్తముండుసం
ఫుల్లదళాయతాక్షి వలపుంగొనె, వంతముతోడ - నంతతో
జెల్లకుచెల్లు! మీ నటన జెప్ప దరంబటె! - రామ ధూర్జటీ! 9

గరళమహాగ్ని మ్రింగు కళకంఠుడ! క్షీరమహాబ్ధిద్రచ్చగా
సిరి లభియింప కైవసము జేసికొనెన్ గడుసైన వాడు - శ్రీ
హరి! అమరుల్ తలొక్కటిగ హస్తగతమ్ములుజేసి కోగ - నీ
కరతలమందు పుఱ్ఱెయె మిగల్చగ - నవ్వెదో? రామధూర్జటీ! 10

పునుకలపేరు, హారములు, పుఱ్ఱెయె భిక్షకు పాత్ర, చిత్రమౌ
యను చరులెల్ల భూతములు, భస్మము మేన నలంది, నందివా
హన! తిరుగాడ - కేశవుడహా! సుమదామము, కౌస్తుభమ్ము, కాం
చన మయపీతవస్త్రములు, చక్రగదాధరుడై, విహారముల్
జను! ఖగరాజుపైన - మతిసఖ్యమదెట్టులో? - రామధూర్జటీ! 11

నందిని, వైనతేయు; గిరినందిని, క్షీరసముద్ర ప్రేమసం
బంధిని; షణ్ముఖున్, కుసుమ బాణుని; - వాహన, పత్ని, పుత్ర సం
బంధముతో - సమానులగు బంధువులై, రసరమ్య, భావనా
సింధువులై, కృపారసముజిందు మహాత్ములు - రామధూర్జటీ! 12

అద్దమునందు నీడవలె రాఘవుడీవును, ఏకసూత్రసం
బద్ధులు, భావనాపథవిభావరిలో జ్వలియించు జ్ఞానసం
శుద్ధులు, తత్త్వశాస్త్ర పరిశోధనలో మనసందలేని, వే
దోద్ధరణావతార రసదుగ్ధపయోధులు! - రామధూర్జటీ! 13

రాజ్యములేక, సీతయనురాగ వియోగము బాడబాగ్నియై
భోజ్యముగాగ, కందఫలముల్ దిని, మౌనిగ స్వామి - భిక్షసా
మ్రాజ్యమువీడి, దక్షసుతప్రాణము వీడ, విరాగివౌచు, సా
యుజ్యతపోగ్నిగ్రాలితివొ? యోగమహేశ్వర! - రామధూర్జటీ! 14

నెత్తిన చేయివెట్టనొక నీచుడు నిన్దరుమంగ - నిత్యస్నే
హోత్తస్వరూప మోహన విహారవిలాసిని, మోహినీ జగ
న్మత్తదృగంత జ్యోత్స్నలయి, మానముగాచె భవుండ! మీదువ్యు
త్పత్తులు, ప్రాతిభాత్తరసబంధురముల్ గద! - రామధూర్జటీ! 15

కల్లలు బొంకు లేని శితి కంఠుడ! భక్తవశంవదుండవై
కొల్లలుగా వరమ్ములను గుప్పిన, రాక్షసులెల్ల క్రూరులై
త్రుళ్ళిన - చాపహస్తుడయి త్రుంచెగదా! రఘురామమూర్తి! మీ
యుల్లములోని వ్యూహము లమోఘములౌనట! - రామధూర్జటీ! 16

కోతులు, కొండముచ్చులును గుంపులుగా రఘురాముగొల్చి, వి
ఖ్యాతిని జెందె, రావణ వధక్రతువందున - కాళ, హస్తియున్
చేతము హత్త భక్తి, శివసేవలధన్యులు నైరి! మీ కృపా
సేతువు మన్ననొకపికి జిక్కి, తరించునె? - రామధూర్జటీ! 17

ప్రాయగబూని నీ కథను, రామ! విదేహసుతా మనోవిషా
దాయత కంఠలీన, కవితా తపమే నొనరింపబూన - భ
స్మాయతలింగ దీధితి - హృదంతర భావరసార్ద్ర ప్రాతిభా
గీతిగ నిల్చె! మీకృపల కెల్లలు లేవుర! - రామధూర్జటీ! 18

నీదు కృపాస్రవంతి, రమణీయముగా హృదయమ్ము నార్ద్రభా
వోదిత శీకరమ్ముల, నవోహల, సత్కవితా తపమ్ముగా
దీధితి జూప - నమ్ముడను దేవర! నీదయకెల్లలేవి? భ
క్త్యాదర ప్రేమభావముల దన్మయుడన్, రఘురామ! ధూర్జటీ! ౧౯

శ్రీ తరుణీ మనోరథవశీకృత ! పర్వత రాజపుత్రికా
శ్వేత తనూమనోప్రణయ స్వీకృత! శస్త్ర మహాస్త్ర జ్ఞానవి
ఖ్యాత! వినీలకంఠ! దశ కంఠవిలుంఠన! రామచంద్ర! అ
ద్వైత గభీరసాగర సుధాకర! శంకర! - రామధూర్జటీ! ౨౦

(భారతి, జులై, ౧౯౮౯)

# నయాగరా !

రాదేం నయాగరా!
నినుజూస్తే
నాకేం కవితాధార? -
ఖండ ఖండాంతరాలల్లో సహజసౌందర్య
జలపాతానివని ప్రశస్తి నొందావు!
శతశతాబ్దాలుగా, ప్రపంచంలో వింతైన, విశాలమైన
నిర్ఝరీ పాతానివని ప్రఖ్యాతిజెందావు!
నిండుగా, మెండుగా, ఏడాదిపొడుగునా, నిట్టనిటారుగా
కొండకొమ్ముల్లోంచి దూకుతుంటావని కీర్తి గడించావు!
కృత్రిమాలంకరణతో, ధగద్ధగాయమానంగా, విద్యుద్దీపాల
వెండివెలుగుల్లో మెరిసిపోతుంటావని పేరుకెక్కావు!
ఋతుస్నాతయైన, శ్వేతసుందరిలా, నురుగుల బంగారు జుట్టు
విరబోసుకొని, ఉరుకులూ, పరుగులూ, తీస్తుంటావని పొగడబడ్డావు!
అమెరికా, కెనడాల సరిహద్దుగా రెండు సంపన్నదేశాల
స్నేహ, హస్త సంచాలన, సంకేతంగా, మైత్రీస్రవంతిగా
ప్రవహిస్తుంటావని ఖ్యాతినొందావు!
పాలనురుగుల్లాంటి పొంగులు, వెండివెన్నెల్లాంటి జిలుగులు,
ఉత్తుంగ తరంగ శీకరాలతో, ఇద్దరినీ అద్దరినీ,
భూమ్యాకాశాలనీ, తడిపేస్తుంటావని -
ఒకటే పొంగిపోతారు ఇచ్చటి జనం!
చిఱుపడవల్లో, పిల్లాజెల్లతో నిన్నుదరిసి, నీఒడిలో తిరుగాడి
నీ అలల చిందుల్ని గాఢంగా దర్శించి,
నీతరంగ శీకర శీతల పవనాల్లో తడిసి, పరవశించి
పులకిస్తారు ఇచ్చటి జనం అయినా -
రాదేం నయాగరా!
నినుజూస్తే
నాకేం కవితాధార?

అప్పుడే ఒడలంతా తడిసి, జలజలా నేలకు రాలే జలబిందువులతో
తడికురులారబెట్టుకొనే, నగ్నపాశ్చాత్యసుందరిలా
కనిపిస్తావు నీవు!
స్వచ్ఛాతి స్వచ్ఛ రజతవసనం ధరించి, తరంగాలు కొంగులా
శీకరాలు కుచ్చిళ్ళులా, ఉత్తుంగ భంగ నినాదాలు,
కింకిణీరవంలా, చెంగుచెంగున ఎగిరి దుమికే కురంగంలా -
ఎదలోతుల్లో వలపుటలలు పొంగి పొరలే
పదహారేళ్ళపడుచులా -
తెలతెల్లగా, కళ్ళుజిగేల్మనేలా, చిందులు త్రొక్కుతూ
ఒళ్ళు పులకరించేలా, కొండకొమ్ముమంచి దూకుతూ
లేత యెండలో మిలమిలాప్రతిఫలిస్తూ, జవ్వనిలా -
ఒకవినూతన సౌందర్యదర్శన మిస్తావు నీవు!
కానీ - ఏం లాభం?
నీలో ముక్కుమూసుకొని మూడు మునకలేయలేం!
నీ వినీలశీతల తరంగాల బాహు పరీరంభంలో
పరవశించి తాదాత్మ్యమందలేం!
నీజలాల్ని సుతారంగా స్పృశించి, పొంగిపోలేం!
నీ నీటిని ఔపోశన పట్టలేం!
నీ వారిని అర్ఘ్యంగా వదలలేం!
తర్పణంగా అంతకన్నా విడవలేం!
నీ హిమశీతల వినీల జలభంగాల కొంగుల్లో తలదాచుకోలేం!
పోనీలే అని -
నీ చల్లని అలలమీద తేలియాడే పిల్లగాలుల
నాస్వాదిస్తూ - జపం, తపం చేసుకుంటూ కూర్చోలేం!
బంగారు రంగుల ఇసుక తిన్నెలులేని, నీ నదీతటంలో
ప్రాణాయామం, యోగాభ్యాసం అసలే చేయలేం!
నీవొక అనాఘ్రాత పుష్పానివి!
నీవొక అసూర్యంపశ్యవు!! నీవొక అస్పృశ్యవు!!!-
నీవొక అందరాని, పురాజన్మచైతన్యంలేని
అధునాతన పాశ్చాత్య శ్వేతసుందరివి!

అసలైన, సిసలైన, 'మోనాలిసా'వి నువ్వు! అయినా - నయాగరా! -
నీవేం శివజటాజూట వినిర్గత గంగాతరంగిణివా?
మందాకినీ స్వచ్ఛశీకర పరంపరల నందించటానికి;
హిమశైల సానువుల్లో ఉపనిషత్తులు ఘోషిస్తూ
ఆర్యావర్త మైదానంలోకి ఉరుకులేయటానికి!
యుగయుగాల, కల్పకల్పాల ఋషీశ్వరుల పవిత్ర
తనూమనోస్నానసంగమంలో పునీతమైన
భాగీరథివా నీవు?
తరతరాలుగా, వేదవేదాంగ విదులు, కోనసీమ పండిత శ్రేష్ఠుల
వనసలతో, సంధ్యావందనాలతో పులకించి, ప్రతిధ్వనించే
గోదావరివా నీవు?
కవిసమ్రాట్టుల కల్పవృక్ష కమనీయ కవితాగానంలో
రసార్ద్రయై, పరవశించి, శివాలాస్యంచేసే -
కృష్ణవేణివా నీవు?
సోమయాజియై, కవిబ్రహ్మయై హరిహరాద్వైత తత్త్వాన్ని
ప్రపంచించిన, భారత మహాకావ్య నిర్మాత,
తిక్కన్నను ఉత్తేజపరచిన -
పినాకినివా నీవు? -
నీహృదయాంతరాంతరాలల్లో వేదమాత ఘోషవినిపించటంలేదు.
నీవినీల జలపాత తరంగమహారావంలో
వేదపండితుల మంత్ర పుష్పం ధ్వనించటంలేదు.
నీ అలల ఘలంఘలలో త్యాగయ్య, అన్నమయ్య, మీరాల
భక్తి శృంగార పారవశ్యగానామృతం వెల్లివిరియటంలేదు .
కానీ -
చెవులు దిమ్మెత్తే, నీ నుర్వులహోరులో
రాక్ అండ్ రోల్, పాప్ మ్యూజిక్, జాజ్‌లే వినిపిస్తున్నాయి!
కట్‌త్రోట్ కాంపిటీటర్ల - శంఖారావాలే ధ్వనిస్తున్నాయి!
మదోన్మత్త, వర్ణవివక్షతాహం కారంతో చిందులుద్రొక్కే
పాశ్చాత్య భావఝంఝుప్రభంజనరావాలే ఘోషిస్తున్నాయి!
కంప్యూటర్ల సంప్రదాయంలో, ముంపులైన

జెట్ స్పీడ్ కమ్యూనికేషన్స్, డ్రమ్‌బీట్ లే నినదిస్తున్నాయి!
నీ తీవ్రఝరీ తరంగ భావనా విచిత్ర విపంచికీ -
నా శాంత గంభీరమనోవీణా తంత్రులకీ
ట్యూన్ కలియటం లేదు! వేవ్ లెంగ్తులు అసలే సరిపోవటంలేదు!!
అందుకేనేమో
రాదేమో నయాగరా!
నినుజూస్తే
నాకేమీ కవితా ధార?! -
సితసితాచ్ఛశ్వేతయువతీ బాహ్యతనూసౌందర్యగర్వంతో
అధునాతన నాగరికతావ్యామోహంతో,
'హైహీల్స్'తో తైతక్కలాడే
నీమనోవాహినీ తరంగ శీకరాలకు అంతెక్కడ?
నీవర్ణ వివక్షతాభావ సంకుచిత శీతలజల తరంగాల
ఘులం ఘులలకు అడ్డెక్కడ? -
కేవల లౌకిక జీవన విధానభాగ్యమొలకించే
చైతన్య నిర్ఝరివి నీవు!
బాహ్య పారిశుద్ధ్యతకే అత్యంత ప్రాధాన్యమిచ్చే
నవనాగరికతా భావ స్రవంతివినీవు!
అడ్డుగా సంప్రదాయపు ఆనకట్టలు లేకుండా
విచ్చలవిడిగా తిరిగే, అధునాతన పాశ్చాత్యయువతీ
స్వైర విహారం నీది!
తనువునేగాదు, మనసునూ, ఇంద్రియాలనీ నియమించే -
తపస్వినివీ, ఆత్మవేత్తవూ గావునీవు!
క్షణభంగురమైన జీవితమే నురగలా,
అణురూపమైన విద్యుచ్ఛక్తి పొంగిపొరలే
తరంగాల అంతశ్శక్తిలా, ఆగకుండా
క్రిందికి దూకే, సజీవ సంచలన నిర్ఝరివి నీవు!
అయినా - నయాగరా!
అతివేగంగా ప్రవహిస్తున్నావు సాగరాభి ముఖంగా!
ముందూ, వెనకా లేకుండా క్రిందికి దూకుతున్నావు నీవు!

ఒక ధ్యేయం లేని పరుగునీది!
ఒక పవిత్ర వినిమయంలేని ప్రవాహం నీది!
నీ తటి యజ్ఞార్థం గాదు!
నీ ఒడి పునీత గంగామాత గర్భంగాదు!
ఒక అపరిచిత విదేశీ యువతివి నీవు!
ఒక విజాతీయ భావనా సరిత్తువునీవు!
జీవనాన్ని, జీవితాన్ని, సమాజాన్ని పునీతంజేసే
అమృత వర్షిణివి కావు నీవు!
సత్సంగ భావనా ప్రబోధం లేని కుటిల కుల్యవునీవు!
అంతరాత్మ ప్రమేయమే లేని లౌకికజీవన ప్రవాహానివి నీవు!
అర్థంలేని హోరునీది!
పురుషార్థం దక్కని జోరునీది!
కల్పకల్పాల పురాణ, కావ్య, వేదాంత, శాస్త్ర మీమాంసాతరంగిణులలో,
యుగయుగాల కర్మ, భక్తి, జ్ఞాన యోగ పురాస్మృతులలో,
తరతరాల వాసనాబల సంప్రదాయ పరంపరలలో -
నిరంతరం ఓల లాడీ -
అనంతకాల మహాప్రవాహంలో, అవిచ్ఛిన్నంగా సాగే
ఈ భారతీయ మహాపవిత్ర సంస్కృతి -
నన్నింకా వదలలేదు - నయాగరా!
అందుకే -
నీ ఉరవళ్ళు, పరవళ్ళుగా ప్రవహించే
శ్వేతాతిశ్వేత శీతల జలపాతతరంగ శీకరరావాలు -
నాడెందంలో ఆనందంతో చిందులు ద్రొక్కటంలేదు!
నాహృదయారవిందంలో
అమృత నిష్యంద మధురగీతాలు ధ్వనించటం లేదు!
ఒట్టి ప్రగల్భాలై, మట్టిలో గలిసే హోరులై
ఎట్టియు అర్థమ్ముగాని భావగీతాలై నిల్చిపోతున్నాయి!
నయాగరా! -
నీ నగారాల సోయగాలు! -
అందుకే - ఎంత ప్రయత్నించినా,

నీవు నన్ను కదిలించలేవు!
నాహృదయాంతరాలలో శతకోటి వీణలు నినదింపలేవు!
నాగుండె గుడిలలో కంచుగంటలు గణగణామ్రోగింపలేవు!
నాభావనా తరంగిణులలో నవకవితా కల్లోలాలను సృష్టింపలేవు!
నాయెదలోని సృజనాత్మక నగారాలను ప్రతిస్పందింపజేయలేవు!
ఓ! నయాగరా! -
నీబాహ్య సౌందర్య వ్యామోహతరంగ
శీకరశీతలానిలాలకు జడున్నై,
నీబాహ్యాంతరాలలో పారిశుద్ధ్యమేగాని
పవిత్రత వెల్లివిరియుని, నిస్తేజానికి స్తబ్ధున్నై,
నీ అనూహ్య వేదనా హృదయ ఘోషలు ప్రతిధ్వనించే నీ మహోత్తుంగ భంగరావాలకు
ముగ్ధున్నై,
వ్యర్థంగా చిందులు ద్రొక్కే నీఝరీతరంగాల పరవళ్ళు చూస్తూ,
స్పర్ధలేని, నీహిమ సమీకృత తరంగ శీకరాల్ని పరికిస్తూ,
నీ వివక్షతా తీవ్ర పాశ్చాత్య భావనా నిర్ఝరీ
ప్రవాహ రావానికి నిష్పతి భున్నై, -
ఊహా విహంగాన్నై
ఎగురలేక అలా నిలుచుండి పోయాను
శిలాప్రతిమలా! -
గళంపెగలక, కలంకదలక
మనసుమూగవోయి, తనువు స్తంభించి
చైతన్య విహీనున్నై ! -
అందుకే నేమో
రాదేమో నయాగరా!
నినుజూస్తే
నాకేమీ కవితా ధార??! -

(సెప్టెంబరు, 1992 లో నయాగరా జలపాతాన్ని కండ్లారా స్వయంగా
చూసినప్పుడు నాలో కలిగిన కవితాప్రతిస్పందనే ఇది - )

# కృతజ్ఞతలు


మా కుటుంబ సభ్యులందరికీ (మనవళ్లతో సహా) -

సాహితీ మిత్రులు, సహృదయులైన శ్రీ గిడుగు రాజేశ్వరరావు, శ్రీ చీకోల్లు సుందరయ్యగార్లకు, -

కోరిందే తడవుగా ముఖచిత్రం కళాత్మకంగా, భావస్ఫోరకంగా చిత్రించి, అందించిన సాహితీ ప్రియులు, కవులు,. కళాకారులు అయిన శ్రీ శీ లా వీర్రాజుగారికి, -

ముచ్చటగా, సకాలంలో ముద్రించిన ప్లేనోగ్రాఫర్స్‌వారికి -

కవరుపేజీని అందంగా ముద్రించిన శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, -

బ్లాక్స్ చేసిచ్చిన్న, గోపీ బ్లాక్స్ వారికి -

నా కవితలను ఆదరించి ప్రచురిస్తూ వచ్చిన, సాహితీ సంస్థలు - 'భారతి' 'రంజని' లకు -

నా కవితా వ్యాప్తికి, అన్ని విధాలా తోడ్పడిన, సహృదయులైన మిత్రులందరికీ

ఇవే

నా కృతజ్ఞతాభివందనాలు -

- రచయిత-